# చేనేతపారిశ్రామికులకు ప్రభుత్వ సహాయం

## ప్రగడ కోటయ్యగారి ప్రకటన

నిడుబ్రోలు, అక్టోబరు 31: చెన్న రాష్ట్ర చేనేత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి ప్రగడ కోటయ్యగారిట్లు వ్రాస్తున్నారు.

చేనేత వస్త్రవ్యాపార మాంద్యమువలన చేనేత పారిశ్రామికుల కేర్పడిన నిరుద్యోగమును తొలగించుటకై చేనేత సహకార సంఘాలకు పెట్టుబడిని సమకూర్చి, బట్టల అమ్మకములో రాగల నష్టమును, ప్రభుత్వము భరిస్తుందనీ, ప్రస్తుతం పనిచేయుచున్న లేక నూతనముగా యేర్పడు చేనేత సహకార సంఘాలలో సభ్యులుగా చేరదలచిన చేనేత పారిశ్రామికులకు, వాటాధనమును ప్రభుత్వము అప్పుగా యివ్వటానికి నిర్ణయించిందని మద్రాసు ప్రభుత్వము ప్రకటించింది. కాని యీ ప్రాతిపదికపై ఒక్క సేలం జిల్లాకు మాత్రము వెంటనే సహాయము చేయబడుతుంది.

చేనేత వస్త్రవ్యాపార మాంద్యము రాష్ట్రమంతటనే, ఆవరించివుంది. రాష్ట్రము అన్ని ప్రాంతాలలోను చేనేత పారిశ్రామికులు వేలాదిగా నిరుద్యోగులై యున్నారు. ఈ పరిస్థితులలో ప్రభుత్వము చేనేత సహకార సంస్థల అభివృద్ధికై చేయదలచిన సహాయమును రాష్ట్రమంతటికి వర్తింపజేయవలెను. చేనేత సహకార సంఘాలకు బట్టల అమ్మకములో రాగల నష్టమును ఆ సంఘాలు సక్రమముగను, సామర్థ్యముతోను, పనిచేసినట్లు ప్రభుత్వం సంతృప్తి జెందినప్పుడే, ప్రభుత్వం భరిస్తుందని, ఆ ప్రకటనలో చెప్పబడింది. ఈ సందర్భములో చేనేత సహకార సంఘాల ప్రతినిధులతో ప్రభుత్వము సంప్రదించి, ప్రభుత్వ సహాయమును పొందుటకై సంఘాలెట్లు తమ కార్యక్రమమును నిర్వహించవలెనో నిర్ణయించడంఅవసరం. మరియు, ప్రభుత్వము తలపెట్టిన యీ పథకము మామూలు ధోరణిలో గాక త్వరితగతిని రాష్ట్రమంతటా అమలుపరుచుటకు ప్రభుత్వము పూనుకోవలెను.

చేనేత వస్త్రవ్యాపార మాంద్యము తాత్కాలికమైనదని తలపోయుటకు బలమైన కారణాలున్నాయని ప్రభుత్వము తన ప్రకటనలో చెప్పింది. కాని కారణాలు వివరించలేదు.— చేనేత బట్టలు అమ్మకం కాకపోవటానికి మిల్లు బట్టల పోటీయే తప్ప మరేమి కారణం లేదు. ఇందుకు పరిష్కారమార్గమును చూడక తాత్కాలిక సహాయములతో చేనేత పరిశ్రమ కేర్పడిన ప్రమాదమును తొలగించగలమని ప్రభుత్వము ఊహిస్తూవుంటే అది పొరబాటే కాగలదు

# "బళ్లారి జిల్లాను విభజించక ఆ ప్రాంతాన్ని ఆంధ్రలోనే చేర్చాలి"

## పట్టణ రేటుపేయర్ల సంఘ కార్యదర్శి ప్రకటన

బళ్లారి, అక్టోబరు 31: స్థానిక రేటు పేయర్ల సంఘ కార్యదర్శి శ్రీ. ఎస్. హనుమంతరావు, పంచాయతీకోర్టు అధ్యక్షులు కె. తిమ్మయ్యశెట్టి, పురపాలక సంఘ సభ్యుడు ఎస్. రాజగోపాలశెట్టిగార్లు ఈ క్రింది ప్రకటన చేస్తున్నారు.

బళ్లారిజిల్లాఅంతయు ఏకఖండమనియు, ఆ నైసర్గికతకు భంగకరముగా జిల్లాను యిప్పుడు చీల్చరాదనియు, కర్నాటక రాష్ట్రము వచ్చువరకు బళ్లారిజిల్లా అంతయు ఒకే కూటమిగా నుండవలెననియు మా జిల్లాకోర్టు అధ్యక్షులు ఈ జిల్లావాసులైన ఆంధ్ర కర్నాటకులపై సమాన ప్రేమతో కావించిన ప్రకటన ఎంతయు హర్షింపతగినది.

ఆంధ్రరాష్ట్రము ముందుగా ఏర్పడునుకాన దత్తమండలము లన్నియు ఆంధ్ర రాష్ట్రములో యిమిడిపోవును. మదరాసు నుండి బళ్లారివరకు భూగోళరీత్యా అప్పుడు సన్నిహితత్వము వుండదు. కడప అనంతపురము చిత్తూరుజిల్లా ప్రాంతములు ఆంధ్ర రాష్ట్ర భాగములు కాన మదరాసుకు బళ్లారికి మధ్యప్రాంతము అంతా ఆంధ్రరాష్ట్రములో చేరిపోవును. సాగరమధ్యమున నున్న ద్వీపమువలె బళ్లారి తమిళనాడులో సంపర్కము కలిగియుండజాలదు. భాషలో, విజ్ఞానములో తదితర వంశానుగతంగా వచ్చేడి అలవాట్లలో విజయనగరపు చారిత్రక అన్యోన్యతలో కర్నాటక సోదరులకు ఆంధ్రులతో వున్నంత సన్నిహితత్వము, అరవ సోదరులతో లేదని మహాబలేశ్వరప్పగారు అంగీకరింతురు. కావున అనంతపురము మున్నగు ఆంధ్రప్రాంత జిల్లాలతో అనుదినము సంపర్కముతో నుండిన (విద్యా, వ్యాపార, వ్యవహారము) మనకు, మన ఆత్మీయులగు కర్నాటక సోదరులకు కర్నాటకరాష్ట్రము వచ్చువరకు ఆంధ్రరాష్ట్రములో తాత్కాలికముగా చేరుట యుక్తము. మన జిల్లా అన్యోన్యత ప్రేమ చెడదు. ముమ్మందు కర్నాటకరాష్ట్రము వచ్చినతోడనే సరిహద్దు సంఘములు తమపనిని ప్రారంభించవచ్చును. ఈ పద్ధతివలన మహాబలేశ్వరప్పగారి సూచనమేరకు బళ్లారిజిల్లా అంతయు ఏకఖండముగా వుండుటయే కాక, యిచట నున్న ఆంధ్రుల కోరికకూడ నెరవేరగలదు.

# ఆంధ్ర కర్నాటక సరిహద్దు సమస్య

## రంగాగారికి నిజలింగప్పగారి సూచనలు

విజయవాడ, నవంబర్ 2: "ఆంధ్ర రాష్ట్రం వచ్చేస్తున్నది. ఆంధ్ర, కర్నాటక రాష్ట్రాలు రెండుకూడ తక్షణం ఏర్పడుటకు వీలుగా యీ రెండు రాష్ట్రాల ప్రజలమధ్య సంపూర్ణమైన ఏకీభావం ఉండటం అవసరం" అని కర్నాటక రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు ఎస్. నిజలింగప్పగారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు ఎన్. జి. రంగాగారికి ఒకలేఖ వ్రాస్తూ అన్నారు. సరిహద్దుల విషయమై ఉభయులము ఒక నిర్ణయానికి రావలసి ఉన్నదనీ, యట్లా నిర్ణయం కదురని ప్రాంతాలేమైనా ఉండేయెడల వాటిని సరిహద్దు నిర్ణయసంఘానికి వదలివేద్దామనీ, ఆ సంఘ నిర్ణయానికి ఉభయులము కట్టుబడి ఉందామనీకూడ నిజలింగప్పగారు లేఖలో సూచించారు.

ఈ సందర్భంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ నియమించిన ఉపసంఘ సమావేశకర్త, బళ్ళారిజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు అగు టి. జి. తిమ్మయ్యశెట్టిగారిని, కర్నాటకరాష్ట్ర కాంగ్రెస్ నియమించిన ఉపసంఘ సమావేశకర్త ఎస్. ఆర్. కంఠినీడ గారు నవంబరు 2 న ఆదోనిలో కలుసుకొంటున్నారనికూడ ఆయన తెలియజేశారు.

# జకోస్లవేకియాలో క్రైస్తవాలయాలు

## ప్రభుత్వ స్వాధీనం

ప్రాగ్, నవంబరు 1: జకోస్లవేకియాలో, క్రైస్తవ సంఘాలకు వాటి ఆస్తిపాస్తులను, ఉద్యోగ నియామకాధికారాలను యావత్తు ప్రభుత్వం నేడు స్వాధీనం చేసుకొన్నది.

జకోస్లవేకియాలో ఇంకా 200 మంది రోమన్ కాథలిక్ మత గురువులు అరెస్టులో ఉన్నట్లు, మతాధికార వర్గాల ద్వారా తెలుస్తున్నది. వీరిలో చాలామంది మతాల పరిపాలన ఉద్యోగులట. ప్రభుత్వంపట్ల భక్తి విధేయతలు ప్రకటిస్తూ ప్రమాణం గైకొంటే వారు, ప్రభుత్వము నుండి జీతములనుపుచ్చుకోవచ్చు; ఇందుకు సంబంధించిన శాసనం యివ్వాళే అమలులోకి వచ్చింది.

ప్రభుత్వం యీ విధమైన రాజీకి ఒప్పుకొని 127 మంది మతాధికారులను తొలగించి విడిచినా బిషప్పులు యింకా ప్రభుత్వశాసనాలను ప్రతిఘటిస్తునే ఉన్నారు. ప్రమాణాలు చేయడానికిగాని ప్రభుత్వజీతాలను పుచ్చుకోవడానికిగాని ఒప్పుకోవడంలేదు.

ఇవ్వాళనుంచి క్రయిస్తవమతాలపైనా గుడులపైనా ఆస్తిపాస్తులపైనా మతాధికారులు నివసించే యిండ్లపైనా ప్రభుత్వానికి సర్వాధికారం ఉన్నది.

### వాటికన్ హెచ్చరిక

ప్రభుత్వతుమాపణ పత్రాలపైఎవ్వరూ సంతకాలు పెట్టవద్దని వాటికన్ రేడియో యివ్వాళ జకోస్లవేకియా కాథలిక్ మతాధికారులకు హెచ్చరిక చేసింది.

# ఆంధ్ర, తమిళ రాష్ట్రాల రాజధానీ నగరాలు

## శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సూచన

శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారిలా వ్రాస్తున్నారు:

పాలుకొంచేము వెచ్చజేసి మీది మీగడ తేర్చి దానిని వేరుచేసి వట్టి పిప్పి పాలను అమ్ముతున్నారిప్పుడు కొందఱు పాలవారు.

మదరాసును సంపూర్ణముగ విడిచిపెట్టి ఆంధ్రరాష్ట్రనిర్మాణం చేసికోగోరు కొందరు వారు పైపాటు కొనుక్కోగోరే వారినంటివారే. ఆంధ్రదేశపు నలుపైపులనుండీ గొప్ప ప్రతిభావంతులూ, ధనవంతులూ ఆంధ్రదేశపు సారాంశముల వదగినవారు నూరేళ్లపైచిలుకు నుండీ మదరాసు పరాయి నగరము కాదన్న అభిమానంతో తమ ఊళ్లలోని యిళ్లు వాకిళ్లు అమ్ముకొని మదరాసువచ్చి నెలకొనడం జరిగింది. వర్తకంకోసం, విద్యలకోసం, ఉద్యోగాలకోసం ఆంధ్రదేశపు మేలిసరకు చాలా మదరాసు పరమయినది. ఇప్పుడు గనుక మదరాసును విడనాడితే మదరాసులో నెలకొన్న లక్షలకొలది తెలుగుప్రజల యోగక్షేమములను తెలుగువారే ఉజ్జగించినవారవుతారు. మనమిప్పుడు వారిని అరవలపాలుచేస్తే రామానుజ మతస్థులై వైష్ణవుల సన్నిధిని ప్రబంధకాలక్షేపముల వినోదముతో తెలుగుతనమునే గర్హించే మదరాసు ప్రాత కోమటిసెట్లవలె, నాయళ్లవలె ఇటీవల చేరినవారూ కాలక్రమాన మారిపోవడం జరగనూ వచ్చును. అపుడు మదరాసు అరవలదే అయితే ఆంధ్రత నభిమానించే అక్కడి ఆంధ్రులంతా తమ బంగళాలు, ఇళ్లూ వాకిళ్లూ అమ్ముకొని మళ్ళీ తెలుగుదేశం వచ్చివేయడం తప్పనిసరి అవుతుంది. దానితో మదరాసు నగరం చెడుతుంది. ఇది యింకో పాకిస్తాన్ విప్లవం అవుతుంది. అమంగళము శాంతించుగాక!

పట్టాభిగారు గాంధీ తత్వజ్ఞులని, గాంధీ సూక్తులకు భాష్యప్రణేతలని ప్రతీతి. ఇక రెన్నాళ్లకు సర్వాంతర్యామి కాబోతా దనగా గాంధీగారు ప్రకాశంగారితో అంతలూ మీరూ సంధిచేసుకోండి మద్రాసు విషయంలో అన్నారన్నది సర్వవిదితం. పట్టాభిగారు గాంధీగారి దివ్యాదేశమును త్రోసిరాజని ఆంధ్రులవాదాన్ని డిస్మిస్ చేసి అరవలపక్షానికే సంపూర్ణంగా తీర్పు చెప్పినారు!! ఏమి తీర్పువల్ల ఆంధ్రులందరూ–అందులో రాయలసీమవారు మరీ చాలా అశాంతి పాలవుతున్నారు. వర్తకమునకు, సముద్రతీరమునకు, రాయలసీమ వారికి మద్రాసు ఆయువుపట్టువు. అరవలకూ ఆంధ్రులకూ కాక ఆంధ్రులకూ ఆంధ్రులకూకూడా పట్టాభిగారి తీర్పువల్ల తగవులు కేసుతున్నవి. గంధీగారి హృదయము

యిట్టిదికాదు. ఇదికాదు సామరస్యపద్ధతి!

సెంటర్ ఎప్పుడూ దేశమధ్యస్థమై ఉండవలెను. ఆంధ్రదేశమునకు విజయవాడ సెంటర్ అవుతుంది. అట్లాగే అరవదేశానికి తిరుచ్చి సెంటర్ అవుతుంది.

విజయవాడ - తిరుచ్చి - రెండిటికి సర్వవిధాలా సామ్యం ఉంది.

(1) రెండూ రెండు దేశాలకు మధ్యస్థములైన ప్రాచీన నగరాలు.

(2) రెండూ శివక్షేత్రాలు - నగరం మధ్య కొండ (కనకదుర్గా మల్లేశ్వరుల కొండ, మాతృభూతేశ్వరుని కొండ) దానిపై దేవతా సన్నివేశము కలవి.

(3) రెండూ మహానదీ (కృష్ణ కావేరీ) సౌభాగ్య శోభితములు.

(4) రెండూ యీ నదులు దాటితే విష్ణుక్షేత్రాలు గలవి. (విజయవాడ కృష్ణ దాటితే అవతలిగట్టున ఉండవల్లి అనంతశయనస్వామి ఉన్నాడు. (పల్లవులనాటి దేవుడు) ఈ ఉండవల్లి పూర్వము కృష్ణా తుంగభద్రల నడిమిద్వీపము. అల్లే తిరుచి కావేరి దాటితే అవతలిగట్టున నదీ ద్వీపంలో రంగనాథస్వామి ఉన్నాడు)

(5) రెండూ గొప్ప రైల్వే జంక్షనులు. రెండూ ఎంతైనా పెంపొందదగిన అవకాశాలు గలవి.

(6) కనుక ఈ రెండూ రెండురాష్ట్రాలకూ ప్రధాన నగరాలయితే మద్రాసు సెంట్రల్ గవర్నమెంటువారి నగరం కావడం సర్వసమ్మతి మవుంది. అరవలూ ఆంధ్రులూ ఇద్దరూ మద్రాసు మాకే మాకే రావలెనని తెగలాగడం మంచిది కాదు. తెగలాగుతే తెగుతుంది. ఆంధ్రుల అరవల సౌహార్దం చెడుతుంది.

మదరాసు మ్యూజియంలో అమరావతీ బౌద్ధస్తూప సౌభాగ్యం కనుల పండువుగా కానవస్తున్నది. మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో ఆంధ్రదేశ గ్రంథాలు వేనవేలున్నవి. నా కంఠలు కరిగేటట్టు ఆంధ్రదేశమంతా తిరిగి నేనక్కడి కెన్నో సంస్కృతాంధ్ర గ్రంథాలు చేర్చినాను. ఎవరైనా అక్కడి లైబ్రరి తెల్గు గ్రంథాలూ, మ్యూజియంలోని అమరావతీ స్తూప శిల్పాలు తెలుగుదేశానికి మళ్లా తెచ్చుకోవచ్చునంటూ రనుకుందాము. సంస్కృత గ్రంథాలమాట? వాటినన్నిటినీ కోల్పోవడమంటే నావడు ఏడుపువస్తున్నది. సంస్కృతాంధ్ర ద్రవిడ కర్నాట గ్రంథాలుగల ఆ లైబ్రరీ సర్వభాషల వారికీ సమాన హక్కులేటట్లు సెంట్రల్ గవర్నమెంటువారి వశంలోనే ఉండాలి.

భాషాశాస్త్ర పరిశీలకులకు అన్ని భాషల గ్రంథాలు ఒక్కచోట ఉండటం

(6 వ పేజి చూడుడు)

# చెన్నపట్నాన్ని చెంగల్పట్, ఉత్తర ఆర్కాట్ జిల్లాలతో చేర్చి చీఫ్ కమీషనర్ రాష్ట్రంగా చేయాలి

## అందుకు ఈ ప్రాంత ఆంధ్రులు ఆందోళన చేయాలని సయ్యద్ అహమ్మద్‌గారి హెచ్చరిక

సత్యవేడు, నవంబరు 1: ఆంధ్రమహాసభ కార్యవర్గసభ్యులు స. అహమ్మద్ గారు యీక్రింది విజ్ఞప్తిచేస్తున్నారు.

ప్రస్తుతం భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన సమయమాసన్నమగు సూచనలు కన్పట్టుచున్నవి చెంగల్పట్టు జిల్లా సరిహద్దులోనున్నది. సరిహద్దులోగల ఆంధ్రుల భాష, సంస్కృతి, ధనమాన ప్రాణములకు భంగమురాకుండ కాపాడుకోవలయుననిన, మద్రాసును దానిచుట్టి యున్న చెంగల్పట్టుజిల్లా పరిసర ప్రాంతములను చేర్చి కేవలం చీఫ్ కమీషనరు పరిపాలన ప్రాంతముగా చేయవలెను. ఇదియే సమంజసమని తోచుచున్నది. ద్విభాషా ప్రాంతముగు చెంగల్పట్టు జిల్లాను ఉత్తరార్కాడు జిల్లాలోని కొన్ని తాలూకాలను చేర్చి మద్రాసును ప్రత్యేక రాష్ట్రముగా చేయమని ప్రభుత్వమును కోరుచు, చెంగల్పట్టుజిల్లా ప్రతిగ్రామములలో గల ఆంధ్రులు సభలుజేసి తీర్మానించి ఆ తీర్మానములను, భారత ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారికిని కాంగ్రెసు అధ్యక్షులు డా॥ పట్టాభి సీతారామయ్యగారికిని, మద్రాసు ప్రధాని పి. ఎస్. కుమారస్వామి రాజాగారికిని, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు, యన్. జి. రంగాగారికిని పంపవలెను.

అట్లుచేసిన మనజిల్లాలోని తమిళులకు ఆంధ్రులకు ఏలాటి వైరుధ్యములుండవు. సౌహార్దమైత్రికి భంగము వాటిల్లదు. సౌహార్ద స్నేహభావములతో యెప్పటట్లు కలసిమెలసి మెలగుటకు వీలుండును. ప్రతి గ్రామములోగల యాంధ్రులు యీ సమయమున మేల్కొని పైరీతిగా తమ అభిలాషను ప్రభుత్వమునకు నివేదింపవలెను.

# తెనాలిలో రివాల్వర్లు తోటాలు దొరకుట

## పోలీసు సోదా ఫలితంగా ఒకని అరెస్టు

తెనాలి, నవం 1: ఇచ్చటి ఘంటావారి వీధిలో నివసించుచున్న వేల్పూరు నాగభూషణం(తండ్రి అప్పయ్య)అనువాని యిల్లును స్పెషల్ డ్యూటీ సబిన్‌స్పెక్టరు యన్. యస్. వెంకోబరావు, టవున్ సర్కిల్ ఇనస్పెక్టరు బి. వీరాస్వామి నాయుడుగార్లు నిన్న పోలీసుదళంతో జల్లి సోదా చేసిరి రెండు రివాల్వర్లు 5 తోటాలువుండేది వకటి, 6 తోటాలువుండేది వకటి, 11 విడితోటాలు 125 రివాల్వర్లకు సంబంధించిన సామానులు దొరికినవని తెలిసినది. నాగభూషణమును అరెస్టుచేసి తెనాలి సబ్ జైలులో రిమాండునందుంచిరి. (స్వ. వి.)

# రేపల్లె కో-ఆపరేటివ్ సొసైటి సభ్యుల సమావేశం

రేపల్లె, అక్టోబరు 30: స్థానిక కో-ఆపరేటివు సొసైటీ లిమిటెడ్ సభ్యుల సమావేశం పలగపూడి వెంకట్రామయ్యగారి అధ్యక్షతను జరిగింది. సంఘానికి 9 సం॥లకుపైగా అధ్యక్షులుగానుండి కీర్తిశేషులైన పాతూరి సుబ్బయ్యగారి అకాలమరణానికి సంతాపము తెలియజేశారు. అనంతరం డైరక్టర్ల ఎన్నికలు జరిగి దేవినేని వెంచయ్య అధ్యక్షుడుగను, చిట్టి సూర్యనారాయణమూర్తి కోశాధిపతిగను ఎన్నుకొబడినారు.

# "మద్యనిషేధ శాసనాన్ని కఠినంగా అమలు చేయకపోతే లాభంలేదు"

## కడప జిల్లా సలహాసంఘ సమావేశంలో మాజీమంత్రి కోటిరెడ్డిగారి హెచ్చరిక

### బద్వేలు తాలూకాలో "సుఖపానం" తయారు: జిల్లా అధికారి వివరణ

కడప, నవంబరు 1: ఈ జిల్లా మద్యనిషేధ సలహాసంఘ సమావేశం నిన్న నిచ్చట జరిగెను. మద్యనిషేధం మాజీ మంత్రి కె. కోటిరెడ్డిగారు మద్యనిషేధ చట్టముక్రింద జరుగు నేరములకు గరిష్ట ప్రమాణశిక్షలను మాత్రమే సూచించియున్నారనీ, కనిష్టప్రమాణ శిక్షలను సూచింపలేదనీ అందువలన సాధారణముగా చాలమంది? కొద్దిశిక్షలే విధిస్తున్నారనీ అందువలన ఇది జయప్రదముగా కొనసాగకున్నదనీనుడివిరి. "ప్రభుత్వమునకు 17కోట్లు ఆదాయంపోయినది. దానిఫలితముసంపూర్ణముగా కలుగకున్నది. స్త్రీలును, బాలురును ఇప్పుడు దొంగసారాయిని త్రాగుటకు అలవాటుపడియున్నారు. ప్రభుత్వము వారు ఈశాసనమునుకఠినముగానైనా అమలుజరుపవలెను లేదా తొలగింపనైనా తొలగింపవలెను." అని రెడ్డిగారనిరి. జిల్లా మద్యనిషేధాధికారి ముసపా సాహెబ్ గారు గ్రామప్రజలు సంపూర్ణముగా అధికారులతో సహకరించుచో ఇది జయప్రదముగా, సాగునని చెప్పిరి. కోటిరెడ్డిగారు బదులు చెప్పుచూ గ్రామములలో ఎవ్వరుకాని సమాచారము ఇచ్చుటకు ముందుకు రారనీ, వారి ఆస్తిని, ప్రాణములను రక్షించుటకు పూచీనిచ్చు వారెవరని ప్రశ్నించిరి.

పిదప జిల్లాఅధికారి బద్వేలులో "హాపీ సిరప్" అనునది ఒకటి తయారైనదనీ, ఒక గ్లాసు నీళ్ళలో 5 లేక 10 చుక్కలు వేసికొని దానిని పుచ్చుకొనినచో, ఒక డ్రాము సారాయిత్రాగితే కలిగేటంతకైపు కలుగుననీ, అనేకులు దీనిని త్రాగినందువల్ల మతిచెడిపోవుచున్నారనీ దానిని వాడువారికి వాపులువచ్చుచున్నవనీ మైదుకూరుగ్రామములో దీనిని త్రాగుటకు అలవాటుపడిన ఒకవ్యక్తి రు. 1-8-0 పెట్టి దీనిని కొనుటకు పైకముచిక్కక ఆత్మహత్య గావించుకొనినాడని తెలిపిరి. దీనికి రెవిన్యూబోర్డు వారు అనుమతి నొసగియున్నారనికూడా చెప్పిరి.

జిల్లాకలెక్టరుగారు ఇదివిని ఆద్రావకమును వాడి మతిచెడినవారిని జిల్లావైద్యశాఖ అధికారికిచూపించి, పోలీసువారికి రిపోర్టుచేయుచో వారు ఇ॥ పీ॥ కోడు క్రింద తగుచర్య గైకొందురని నుడివిరి.

### కోటిరెడ్డిగారి విమర్శ

కడప, కోటిరెడ్డిగారు పత్రికా విలేఖరులతో గోష్ఠి జరుపుతూ మద్యనిషేధం అమలు చేయుటను గురించి ఈ దిగువ విమర్శచేసిరి:

"దొంగసారాయి తయారుచేయువారిని గురించి తెలియనిఉద్యోగికాని, పౌరుడుకాని యుండజాలడు అట్టివారిపై సాక్ష్యముచిక్కక పోవచ్చును. కాని అట్టివారిని డిటెన్యూగా కారాగృహములలో బంధించినచో దొంగసారాయి వండుట తగ్గిపోవును. దొంగ సారాయి విస్తారముగా తయారగుటవల్ల వ్యవసాయ పనులకు కూలివారు చిక్కుటలేదు. దొంగతనముగా సారాయిని తయారుచేసి విక్రయించుచో వారికి ఏలాటి కష్టములేక ఎక్కువ కూలి లభించును.

"నేరస్థుల పేర్లను తెలుపవలెనని గ్రామప్రజలను కోరుటవల్ల ఏలాటి లాభములేదు. అటుల ఎవరైనను తెలుప సాహసించినచో వారి ప్రాణములకు భద్రతయుండదు. గ్రామప్రజలు అధికారులను నమ్మి నేరస్థుల పేర్లను తెలుపజాలరు. నేను మద్యపాన నిషేధశాఖకు మంత్రిగా యుండినపుడు ప్రజలకు ఒక వాగ్దానము చేసియుంటిని. మద్యపాన నిషేధచట్టము క్రింద ఎవరైనను నేరములు గావించుచో అట్టివారి విషయమై నాకు స్వయముగా ఉత్తరములు వ్రాయుచో, ఆ ఉత్తరమును నేను స్వయముగా చించి చదువుకొని, నాకు సమాచారము పంపిన వారిపేరు ఎవ్వరికిని తెలుపక క్రింది ఉద్యోగులకు తగు చర్యగైకొనమని వ్రాసెదనని నమ్మజెప్పితిని. నాకు వచ్చుచుండిన ఉత్తరములను నా ప్రయివేటు సెక్రటరీకి కూడ కాకపంపక పెట్టియుంచితిని. నేనే స్వయముగా చించి చూచుకొని క్రింది యుద్యోగులను తక్షణము చర్యగైకొనమని వ్రాసి కొన్ని నేరములను పట్టుకొంటిని. ఎక్సైజు బోర్డువారు వారికిసమాచారము తెలుపకనే క్రిందివారలకు ఎందుకు వ్రాయుచున్నానని నన్నడిగిరి. వారికి తెలిపి, వారిద్వారా క్రిందివారికి తెలుపుటలో ఆలస్యమగుననీ, నేరమును త్వరగా పట్టుటకై నేరుగా క్రింది అధికారులకు వ్రాయుచున్నానని ప్రత్యుత్తర మొసగితిని. ప్రతివారికిని సంపూర్ణ నమ్మకముండవలెను. దీక్షతో పనిచేయవలెను. అప్పుడే మద్యపాన నిషేధచట్టము జయప్రదముగా కొనసాగును.

### అమ్మోనియం సల్ఫేట్ సరఫరా

#### ప్రభుత్వ విధాన విమర్శ

రసాయనిక ఎరువులను రైతులకు రెండు ఎజెన్సీలద్వారా సప్లయిచేయు విధానము, నిన్న నిక్కడ జిల్లా కలెక్టరు బి. మాధవరావుగారి అధ్యక్షతను జరిగిన జిల్లా అధికాహార ఉత్పత్తి సంఘసభలో తీవ్రమైన విమర్శకు వచ్చెను.

ప్రతిసభ్యుడును ప్రయివేటు వర్తకులు అమ్మోనియం సల్ఫేటును ఒక్కొక్కమూటను రు. 45/- మొదలు రు. 50/-లకు విక్రయించుచున్నారని చెప్పి విమర్శించిరి.

కె. కోటిరెడ్డిగారు మాటలాడుచూ ప్రభుత్వమువారు ప్రయివేటు వర్తకులను నమ్మనైనా నమ్మవలెను. లేదా బొత్తిగా వారిని నమ్మకూడదు అనిరి. కంట్రోలు చేసిన వస్తువులు వ్యవసాయ శాఖద్వారాను, ప్రయివేటు వర్తకులద్వారాను ప్రజలకు సప్లయి చేయించుట తప్పనీ, వానిని ప్రభుత్వశాఖలద్వారానే ప్రజలకు పంచిపెట్టవలెననీ ప్రయివేటు వర్తకులకు ఒప్పగించినచో బ్లాక్‌మార్కెటు తప్పదనీ నుడివిరి.

జిల్లాకలెక్టరుగారు తాము ఈ విషయమై అవినీతి నిరోధక శాఖవారికి వ్రాసి, అట్టి వ్యాపారస్థులపై చర్య తీసుకొనేటట్లు చేసెదమనిరి.

రసాయనిక ఎరువులన్నియు వ్యవసాయశాఖద్వారానే సప్లయి చేయుటకు ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమువారిని కోరుచూ ఒక తీర్మానముచేసిరి.

### సర్దార్ పటేల్ జన్మదినం

నిన్న పటేల్‌గారి జన్మదినోత్సవ సందర్భములో ఇక్కడ యస్. సుబ్బరాయ శర్మగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. గాజులపల్లె వీరభద్రరావుగారు పటేలుగారు దేశమునకు ఒనర్చిన మహోపకారమునుగూర్చి ఉపన్యసించిరి:

# తుపానువల్ల ఒక్క కృష్ణాజిల్లాలోనే 500 మంది మరణం

## పంటనష్టం దాదాపు 8 కోట్ల వరకు ఉండునని రంగాగారి అంచనా

### 85 వేల ఇండ్లు ధ్వంసమైపోయినవని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

**విజయవాడ, నవంబరు 2: కృష్ణాజిల్లా తుపాను, వరద బాధిత ప్రాంతాలలో పర్యటించి నేడుతిరిగివచ్చిన ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగాగారు పి. టి. ఐ. విలేఖరితో ప్రసంగిస్తూ, యీ తుపానువల్ల ఒక్క కృష్ణాజిల్లాలోనే కనీసం 500 మంది అయినా మరణించి ఉంటారనీ, 6 వేలకు పైగా పశువులు ప్రాణాలు గోల్పోయినవనీ అన్నారు. పంటలకు, రహదార్లకు, ఇండ్లకు, కలిగిన నష్టం 8 కోట్ల రూపాయల వరకు ఉంటుందని అన్నారు.**

ఈ పర్యటనలో. రంగాగారి వెంట స్థానిక కాంగ్రెసువాదులు కూడ ఉన్నారు. తాము కొన్ని ప్రాంతాలలో విచ్ఛిన్నమైన మానవ శవాలను, పీనుగ గుట్టలను, చూశామనీ, నీటిపై తేలుతున్న శవాలను కొన్నిచోట్ల చూశామనీ రంగాగారన్నారు. కొన్నిగ్రామాలు పూర్తిగా జలమయమై పోవటంచేత, యీ శవాలను దహనంచెయ్యటానికిగాని, ఖననం చెయ్యటానికిగాని ఒక్క అంగుళం మేరకూడ నీటి బైట లేకుండా ఉన్నదన్నారు. జిల్లాలోని 1127 గ్రామాలలో సుమారు 85 వేల యిండ్లు ధ్వంసమై పోయినాయనీ, పంట చెరువులు దాదాపు అన్నిటికీ గండ్లుపడినవనీ కూడ ఆయన తెలియజేశారు.

ఈ బాధితులకు, ధనసహాయము, ఆహార పదార్థాల సహాయమేగాకుండా వైద్య సహాయం కూడ అవసరమని రంగాగారన్నారు: నష్టవివరాలను లెక్కవెయ్యటానికిగాను ప్రతిగ్రామానికీ లేదా కొన్ని గ్రామాలకు కలిపిగాని, విచారణ సంఘాలను ఏర్పాటుచేయాలనీ, ఆహార పదార్థాలు, యితర అవసర వస్తుసామగ్రి గ్రామములకు సక్రమంగా పంపకమునట్లు చేయటానికిగాను సహకారసంఘాలు ఏర్పాటు చేయాలనీ ఆయన అన్నారు. పేదలకు పునరావాస సౌకర్యాలు కలుగ జెయ్యటానికిగాను పంచాయతీ బోర్డులు తమవద్దనున్న ధనమును వినియోగించటానికి అధికారమిస్తూ తగిన ఉత్తరువులు పంపవలసిందని రంగాగారు మద్రాసు ప్రభుత్వాన్ని కోరారు.

రంగాగారు సపరివారంగా తూర్పుగోదావరిజిల్లాలో పర్యటించటానికి నేటి ఉదయం బయలుదేరి వెళ్లారు.

### రంగాగారి పర్యటన వివరాలు

గుడివాడ, నవంబర్ 1: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగాగారు దుగ్గిరాల బలరామకృష్ణయ్య, రామకోటయ్య, నల్లయ్య గార్లతో కలసి కృష్ణా జిల్లాలో తుపాను బాధిత ప్రాంతాలలో పర్యటించటానికి నేను బయలుదేరి వెళ్లారు. వారు తమ పర్యటన సందర్భంలో హరిజన వాడలకు వెళ్లి అక్కడి పరిస్థితులను పరిశీలించారు. తుపాను తాకిడికి యిండ్ల కప్పులు కూలటం వల్ల దాదాపు 300 మందికి పైగా మరణించారని ప్రజలు రంగాగారికి తెలియజేశారు. అనేక యిండ్లు వరదలలో కొట్టుకొని పోయినవని కూడ తెలియజేశారు. రంగాగారి బృందం వారు చూసిన పైరు పొలాలన్నీ దాదాపు పూర్తిగా ధ్వంసమై పోయినవి. ఎక్కడైనా తుపాను దెబ్బకు తట్టుకొన్న పొలం ఉన్నట్లయితే దానినుండి మామూలు పంటలో నాలుగవ వంతు కూడ వచ్చే అవకాశం కనుపించటం లేదు.

కైకలూరు, గుడివాడ తాలూకాలకు విజయవాడ తాలూకాలోని 30 గ్రామాలకు రహదారి సౌకర్యాలన్నీ పూర్తి ధ్వంసమై పోయినవి. ఈ భయంకర పరిస్థితి యింకా అంతమై పోలేదు. మునేరు ముంపుకు ఎగువ గ్రామాలు నీట నుండి బయట పడుతుంటే దిగువ గ్రామాలు కొత్తగా మునిగి పోతున్నవి.

పర్యటనాంతరం రంగాగారిని నష్టమును గురించి ఏమైనా చెప్పగలరా అని అడుగగా యీ దెబ్బ వల్ల ఎన్ని వందల మంది మరణించారో చెప్పటానికి కనీసం పదిరోజులైనా పట్టుతుందనీ, యీ ప్రాంతమంతా పశువుల శవాలతో నిండియున్నదనీ అన్నారు. ఈ ప్రాంతంలోగల ఇండ్లలో కనీసం 80% అయినా ధ్వంసమై పోయినవనీ, పంట 75% వరకు నష్టమై పోయిందనీ, పశువులు 25% వరకు మరణించినాయనీ, ఆయన అంచనా వేసి అన్నారు. ఆంధ్రదేశంలో తుపాను కలిగించిన సంక్షోభంలో కొద్దిమాత్రమే మేము చూడగలిగామన్నారు.

ఏలూరు, భీమవరం, నర్సాపురం తాలూకాలనుండి రంగాగారికి విషాదకరమైన వార్తలు వచ్చినవి. రహదారీ సౌకర్యాలన్నీ పూర్తిగా ధ్వంసమై పోవుటచే తూర్పు పశ్చిమగోదావరిజిల్లాలలో తుపానువల్ల ఎంతనష్టమైనదీ నికరంగా తెలియటము లేదు.

రంగాగారు ఒకప్రకటనచేస్తూ, రాష్ట్ర కాంగ్రెస్ తుపాను బాధితుల సహాయనిధికి భారతప్రజలందరు ముఖ్యంగా దక్షిణ భారత ప్రజలు విరివిగా విరాళా లివ్వవలసిందని విజ్ఞప్తి చేశారు.

"గుంటూరు, నెల్లూరు, కృష్ణా, కడప జిల్లాలలో వరద బాధితుల సహాయార్థము రాష్ట్రకాంగ్రెసువారు నెల కిందట యీ నిధి ప్రారంభించినప్పుడు, కృష్ణా ఉభయ గోదావరుల ప్రజలు తిరిగి యిటువంటి ఘోరవిపత్తుకు గురి అవుతారని నేనుకలలో కూడ భావించలేదు. ఈ ప్రాంతాలలోని లక్షలాది వ్యవసాయ కూలీలకు సంభవించిన దారుణవిపత్తు ఊహాతీతం. దేశంలోని ప్రజలందరు, దురదృష్టవంతులైన యీ తుపాను బాధితులకు తక్షణం సహాయము చెయ్యటానికి ముందుకు రావలసిందని కోరుతున్నాను." అని రంగాగారు తమ ప్రకటనలో వివరించారు.

### మామూలుస్థితి ఏర్పడ్డానికి ఇంకా వారంరోజులు పడుతుంది

(స్వకీయ విలేఖరి)

గుడివాడ, నవంబరు 3: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు ఎన్. జి. రంగా, కార్యదర్శి సీబుల రామకృష్ణయ్య, తూర్పుకృష్ణా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు మాగంటి అంకినీడుగారు గుడివాడ, కైకలూరు తాలూకాలలో తుపాను బీభత్సానికి గురిఅయిన గ్రామములను కలుసుకొన్నారు. కృష్ణాజిల్లా మొత్తంమీద సుమారు 8 కోట్ల రూపాయల నష్టం వాటిల్లినట్లు అంచనా వేశారు.

జిల్లాకలెక్టరు, జిల్లాబోర్డు ఇంజనీరు, జిల్లా ఆరోగ్యశాఖాధికారి తాలూకాలలో పర్యటించి, సహాయకార్యాలు త్వరితంగా చేయిస్తున్నారు.

గుడివాడ పురపాలక సంఘంవారు మొన్న సమావేశమై తుపానువల్ల నిరాధారులూ, నిరాశ్రయులూ అయినవారి సహాయం నిమిత్తం రూ. 25,000/-లు మంజూరుచేసి, మొత్తము మంజూరు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు.

స్థానిక శ్రీ వేంకటేశ్వర మోటారు సర్వీసు యజమాని కటారి సత్యనారాయణ, బియ్యం చిల్లరవర్తకులు 15 వేల మందికి నెలకు భోజనాలు ఏర్పాటు చేశారు.

మునేరు ఏటి ముంపుకు లోనైన

### కృష్ణా జిల్లా బోర్డు పాఠశాలలకు నష్టం

#### ప్రజలకు అధ్యక్షుని విజ్ఞప్తి

చిలకలపూడి, నవంబరు 1: కృష్ణా జిల్లాబోర్డు అధ్యక్షుడు కాకాని వెంకటరత్నంగారు ఈ దిగువ ప్రకటన చేశారు: కృష్ణాజిల్లాలో అక్టోబరు 27, 28 తేదీలలో వచ్చిన తుపాను బీభత్సమువలన జిల్లాబోర్డు ఆధ్వర్యమున నడుపబడుచున్న సెకండరి, ఎలిమెంటరి పాఠశాలల భవనములు పడిపోయినవని తెలియవచ్చినది. కావున బోర్డు మేనేజిమెంటుక్రింద నడుపబడుచున్న ఎలిమెంటరి, సెకండరి పాఠశాల లన్నిటికి 10-11-49 వరకు కంపెన్సేషన్ సెలవలు యివ్వడమైనది. ఈ శెలవలకు బదులుగ సంవత్సరాంతమున భర్తీ చేయుటకు ఏర్పాటు చేయుడమైనది.

ఈ తుపాను బీభత్సమువలన ఈ జిల్లా బోర్డుకు రు. 10 లక్షల నష్టముండునని అంచనా వేయబడుచున్నది. కావున ఆయా గ్రామాలలోని ప్రజలు తమ తమ గ్రామములలో పడిపోయిన పాఠశాల భవనము లన్నిటిని ది 10-11-49 తేది లోపల బాగుచేయుటకు తోడ్పడవలెననియు, సహకార మొనరించి విద్యకు ఆటంకము కలుగకుండ సహాయ పడవలెననియు కోరుచున్నాను.

గ్రామాలవారికి రెవిన్యూ ఉద్యోగులు, పౌరులు ఆహార పదార్థాలు వండినవి పడవలలో పంపుతున్నారు. గుడివాడ ఏలూరు రోడ్డుపై 6 మైళ్ళ మేర ఇంకా నీరు ప్రవహిస్తున్నది. గుడివాడ కైకలూరురోడ్డు కూడా బాగుపడినది. బస్సుల రాకపోకలు తిరిగి ప్రారంభమైనవి. గుడివాడ భీమవరం రైలుమార్గంలో రాకపోకలు త్వరలో ప్రారంభమవుతాయని తెలిసినది.

గుడివాడ, కైకలూరు తాలూకాలలో ప్రాణనష్టం 200 పైచిలుకు వుంటుందంటున్నారు. కానుకొల్లులో 25 మంది, చేవూరు, శ్రీ హరిపురం, సింగరాయపాలెములలో 36 మంది, సరజాలలో 10 మంది మరణించినట్లు తెలిసింది. శ్మశానాలునీళ్ళమయమై పోవడంవల్ల దహన సంస్కారానికి వీలులేక శవాలను కాలువలలో పారవేస్తున్నారట.

మొన్న మళ్ళీ ఇక్కడ 4 దుక్కులు వర్షం కురిసింది. ఆకాశం ఇంకా మేఘావృతి మవుతూ నేవుంది మామూలు స్థితిగతులు ఏర్పడడానికి ఇంకా వారంరోజులు పడుతుందంటున్నారు. అధికారులు, పౌరులు రోజూ 10 వేలమందికి భోజనాలు ఏర్పాటు చేస్తున్నారు. కైకలూరుకు టపా ఎస్సులో పంపుతున్నారు.

### గుడివాడతాలూకా కాంగ్రెస్ అధ్యక్షుని ప్రకటన

గుడివాడ, నవంబరు 1: ఈ తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు యీ ద్వ లింగయ్యగారిట్లు వ్రాసిరి. ఈ తాలూకాలో 27-10-49 రాత్రి పెద్దపెట్టున తుపాను చెలరేగి తాలూకాలోని అన్ని గ్రామాలలో పూరిండ్లు ఏమియు నామరూపాలులేకుండాను, పెంకుటి భవనములు చాలాభాగము శిథిలమయి యున్నవి. మనుష్యులు సుమారు 70 మందిన్ని, పశువులు 1000 న్ని చనిపోయినవి. పంటలు యావతు నాశనమయిపోయినవి. రైతులు కూలీలు అల్లాడి పోవుచున్నారు, వున్న వాడులేనివాడనే స్థితిలేదు. యెవరిప్రాణము వారు దక్కించుకొనుట దుర్లభమైనది. పులిమీదపుట్ర అన్నట్లుగా బుడమేటి వరదలవల్ల యీ తాలూకాలో సుమారు 20 గ్రామములు మునిగిపోయినవి. కొన్ని గ్రామాలవారి సంగతుంకూడ యింతవరకు తెలియలేదు. యావన్మంది ప్రజలు భీతిల్లుచున్నారు. భవిష్యత్తులో యెట్లు జీవించ నున్నారోకూడ చెప్పటకు అస్కారమువ లేకున్నారు. గ్రామాలు అన్నియు చచ్చిన పశువులవల్ల వాసనపుట్టి కలరాలు వ్యాపించగలవనే భయోత్పాతము కలుగుచున్నది. రహదారులు యావత్తు బంద్ అవుటవల్ల ప్రజలుప్రక్కగ్రామాలలో వున్న బంధుమిత్రులయొక్క స్థితినికూడ తెలిసికొనలేని స్థితిలోవున్నారు. రైతులు పూర్తిగా నష్టపడికూడ, కూలీల బాధలుచూడలేక యే గ్రామమునకా గ్రామము సహాయపడుచున్నారు. గుడివాడ డిప్యూటీకలెక్టరు, తహసీలువారు యింకా కొందరు అధికారులు తాలూకా కాంగ్రెసువాదులు సహాయము చేయుచూ, దీనప్రజలకు తాత్కాలిక ఆహారములు ఏర్పాట్లు చేయుచున్నారు, బుడమేటి వరదలవల్ల మునిగిన గ్రామాలకు బియ్యం సప్లయికూడా చేయబడుచున్నవి. మద్రాసు ప్రభుత్వము వారు వెంటనే పర్యటించి కూలీప్రజల యిండ్లకు తగుసహాయము చేయవలసినదిగాను, పూర్తిగా మునిగినయావత్తు పైరులు అజమాయిషీ చేయించి నిరాశాపీడితులైన రైతులకు తగుసహాయము చేయించవలసినదిగాను కోరుచున్నాను.

### వుండవల్లి

నవంబరు 2: ఇక్కడ తుపాను బీభత్సమువల్ల సుమారు 60 పూరి యిండ్లు పడిపోయినవి. కొద్దిగా పశునష్టముగలిగినది. షుమారు 4, 5 వందల సంవత్సరములనుంచి వున్న పెద్ద మర్రివృక్షము పడిపోయినది. చాలామంది యిండ్లుపోయి నిలవనీడలేక చాలా అవస్థలు పడుచున్నారు. మంగళగిరి డిప్యూటి తహసీల్‌దారు, డిప్యూటి కలెక్టరుగార్లు వచ్చి పరిస్థితులు చూచి యిండ్లుపోయి బాధపడుచున్న వారికి ఉచితముగా ఒక వారం రేషన్ యిచ్చు ఏర్పాటు చేశారు. హరిజనపాలెములు రెంటిలోను చాలా పూరియిండ్లుపడిపోయి ప్రజలు నిలవనీడలేక చాలా బాధలు పడుచున్నారు. కృష్ణానది నీరు తుళ్ళూరు, మందడం మొదలగు గ్రామాదులకు తగిలి యీపూరు మీదగావచ్చుచూ యీగ్రామ పైరులు అన్ని మునిగినవి యీ సమీపమునవున్న మదనమోహన మైల్సు కంపెనీ పూర్తిగా పాడైనది. యీప్రాంతము తుపానువల్ల చాలానష్టపడినది. కొన్ని గ్రామాదులలో జననష్టపడినట్లు వార్త తెలిసినది.

### పామఱ్ఱు

పామఱ్ఱు, నవంబరు 1: తుపానుగాలి పశ్చిమదిశనుండి మహారావంతో భీకరంగా వీచింది. పామఱ్ఱులోను చుట్టుప్రక్కల గ్రామాలలోను పూరిగుడిసెలు తాటాకుపాకలు కూలిపోయినవి. రాతిగోడలుకొన్ని పడిపోయినవి. పెంకుటిళ్ళపై పెంకులు ఎగిరిపోయినవి. కొన్ని పశువులు మరణించినవి. మహావృక్షములు కూకటివేళ్ళతో పెల్లగిల్లి పోయినవి. బస్సులు ఆగిపోయినవి. మెట్టపైరులు చెడిపోయినవి. వరిపైరు పొట్టవిచ్చు తరుణమగుటచే తుపానువలన రైతులకు చాలనష్టము కలిగినది. కృష్ణా జిల్లాబోర్డు ప్రసిడెంటు కాకాని వెంకటరత్నంగారు పామఱ్ఱు హైస్కూలునకు విచ్చేసి హైస్కూలుపాకలు పడిపోవుటవల్ల వారముకోజులవరకు హైస్కూలును మూసివేయుట కాజ్ఞ ఇచ్చిరి.

### గుండేరు వరద వల్ల నష్టం

చోరగుడి, నవంబర్ 1: బందరు కాలువ నుండి బొడ్డంకి, గ్రామము వద్ద చలిపచ్చిన గుండేరు, ఇటీవలి తుపాను వలన విపరీతముగా పొంగి దానికిరువైపు లాగల వరిచేలకు విపరీత నష్టము గలుగజేసినది. యీ గుండేరు బందరు వద్ద సముద్రములో కలయుచున్నది. గన్నవరం తాలూకాలోను, దివి తాలూకాలోను కూడా ఈ ఏరు ప్రవహించి బందరు కాలువ నుండీ, కరువు కాలువ నుండీ వచ్చు మురుగునీటిని సముద్రమున చేర్చును. దీనికి ఇరువైపుల వున్నవాలు ప్రదేశము ఆయా జమీందారులు రైతులకు పట్టాలు యిచ్చుటచే. అది వారిచే పూడ్చి వేయబడి సాగు చేయుబడుచుండుటచే వాలు ప్రదేశము గుండా నీరు పోవుటకు వీలు గాక, పొంగి పొరలి మాగాణి భూముల మీంచి విపరీత నష్టము గల్గించినది. యీ డ్రయినును అభివృద్ధి చేయించి, అడ్డముగా వున్న పర్మిషన్ లేని సాగులను గట్లను వెంటనే తీసివేయించ వలసినదిగా కలెక్టరు గారిని యిచ్చట రైతులు కోరుచున్నారు.

### చీరాలలో మరల పెద్దవర్షం

#### వరిపంటలకు విశేషనష్టం

చీరాల, నవంబరు 2: గతే రాత్రి ఈ వూరిలో తిరిగి పెద్ద వర్షము కురిసినది. ఈ చుట్టుపట్ల గ్రామములలో వరిపైరు అంతా నష్టమేనని, దీనివల్ల రైతులకు జీవనోపాధి జరుగకపోవడము, పశుగ్రాసము నష్టము, జరుగుటయేగాక శిస్తులుగూడ చెల్లించు శక్తి ఉండదని అనుకొనుచున్నారు. యీ వర్షమువల్ల, లోగడ తుపానువల్ల ప్రాణనష్టంమాత్రంలేదు. ఈ ప్రాంతములలో షుమారు 10 వేల యకరములు నీటిలో మునిగిపోయి, నష్టపడినట్లు చెప్పుకొన్నారు. నష్టము వివరములు యింకను పూర్తిగా తెలియవములేదు. (స్వ. వి.)

### పొగాకు ఉత్పత్తి దారులకు సూచన

గుంటూరు, నవంబరు 1: తుపానువల నష్టపడిన పొగాకు వుత్పత్తిదారులు, బారెనులు కలిగియున్నవారలు వెంటనే వారికి కావలసిన డోరియాస్టీలు రేకుల వివరములతోను, యితర బారెను సామాను వగైరాల వివరములతోను ఆయా

### మదరాసు గవర్నరు భూరి విరాళము

మదరాసు, నవంబరు 3: మదరాసు గవర్నరు మాన్యశ్రీ కృష్ణకుమార్ సింహజీ భావసింహజీ ఆంధ్రదేశములోని తుపాను బాధితుల సహాయార్థము 5 వేల రూపాయలు విరాళమొసగిరి. ఈ విరాళము రాష్ట్ర సహాయనిధి ద్వారా ఇచ్చియుండిరి.

ఈ సందర్భమున గవర్నరుగారు ఇట్లు విజ్ఞప్తి చేసిరి. ఇటీవలి తుపానువల్ల ఆంధ్ర జిల్లాలు కని, విని ఎరుంగని నష్టకష్టములకు గురియైనవి. వేలకొలది ఇళ్లు నాశనమవుటవలన బహుళజనములు నిరాశ్రయులైరి. లక్షలకొలది విలువగల పంట, పశువులు, ఆస్తినష్టమైనది. పత్రికల వార్తలను బట్టి తుపాను దెబ్బతిన్న ప్రాంతములలో విపరీతనష్టము కలిగినట్లు తెలియును.

అధికార, అనధికారసంస్థలు నిరాశ్రయులకు, బాధితులకు సహాయము చేయుచున్నవి. ప్రభుత్వమువారు పెద్దమొత్తములను మంజూరుచేసిరి. అధికార, అనధికార సంస్థలు నిధులను వసూలుచేయుచున్నవి. ఈ జిల్లాలలోని అభాగ్యులకు మాహృదయపూర్వకమైన సానుభూతి, సాంత్వనము. వారిబాధను నివారించుటకు మనమందరము యథాశక్తి తోడ్పడుట విధాయకము. ఏ కొంచెమైనను బాధానివారణకుగాను ఉదారులకు ప్రజలు అధికార అనధికార నిధులకు యథాశక్తి విరాళము లివ్వవలెనని విజ్ఞప్తి చేయుచున్నాను అనిరి.

### తుపాను సహాయ నిధి

మదరాసు ప్రావిన్షియలు వెల్ఫేరు ఫండు నిర్వాహకులు ఆంధ్రదేశమున తుపానుబాధితులకు సహాయం చేయదలచిరి. చందాలు ఇవ్వదలచిన వారందరు, కోశాధికారి పేరన ఇంపీరియల్ బ్యాంకులో జమకట్టవలెనని తెల్పుచున్నారు.

### వరదబాధితుల సహాయార్థం సివిల్ సప్లయిస్ శాఖ యత్నములు

చెన్నపట్నం, నవంబరు 3: ఆంధ్ర జిల్లాలైన గుంటూరు కృష్ణ పశ్చిమగోదావరిలలో ఇటీవల సంభవించిన తుపానువల్ల ఆహారపైరులకు కొంత విశేషముగా నే నష్టము కలిగియున్నట్లు బాగా రూఢి కానట్టి వార్త తెలియవచ్చినదని సివిల్ సప్లయిస్ డైరెక్టరు శ్రీ యన్. యస్. అరుణాచలంగారు పత్రికా విలేఖరులతో చెప్పిరి. పై మూడుజిల్లాలలో బాధితులకు ఆహారము లారీలలో సప్లయిచేయించుటకు జిల్లా సప్లయి ఆఫీసర్లకు ఉత్తరవు చేయబడియున్నది. ఈజిల్లాలలో బియ్యం మిల్లులు కూడా చాలాచోట్ల చెడిపోయినపని చేయకున్నవట. వరద బాధితులకు సహాయముచేసే పనులుచేయుటకై పై మూడు జిల్లాలకు చేరి 6 జీపుసాప్పున ఒక నెలరోజులవరకు ప పబడినవని తెలిపిరి.

ఈ జిల్లాలలో ఆహార ధాన్యములు యితర ఆస్తులుకూడా తుపానువల్ల విశేషముగా నష్టమైన కారణమున ఆ జిల్లాల నుండి యీ నెలలో వసూలు కావలసిన ధాన్యం కోటాలను విజయవాడ తాడేపల్లిగూడెం ధాన్యసేకరణ ఏజెంట్లనుండి వసూలుచేయకుండా ప్రభుత్వం బహుశా మాని వేయునని తెలియుచున్నది.

### అనకాపల్లిలో 3 లక్షల నష్టం

అనకాపల్లి, అక్టో. 30: ఇక్కడ 26 వ తేదినుండి గాలివాన ప్రారంభమై 30 తేదితో పూర్తిఅయినది. గాలివాన అపరిమితముగ నుండెను. శారదానది పొంగిగట్టు తెగి గ్రామమునిాద పడి గాంధినగరము, నరసింగరావు పేట, విజయరాజు పేట, లక్ష్మీదేవిపేట, వుడ్ పేట. వేల్పులపేట గవరపాలెము ప్రవాహముతో 10 గంటల కాలము నిండిపోయినవి. కొన్నిస్థలములలో రెండుదినములు గడిచినను నీరుతగ్గలేదు. రోడ్లుకొట్టివేయబడెను. ఇళ్లుపడిపోయినవి. సామానులు కొట్టుకు పోయినవి. ఒకదినము పూర్తిగ కాలపురుషుడు వికటాట్టహాసములతో విలయతాండవము గావించుట చూచి ప్రజలు భయభ్రాంతులైరి. ప్రభుత్వోద్యోగులు పుర ప్రముఖులు, వర్తకసంఘమువారు ప్రజలకుసహాయపడుచున్నారు. నష్టము సుమారు 3 లక్షలు అంచనా వేయబడినది. (స్వ. వి.)

ప్రాంతపు కోలు కంట్రోలు యిన్స్పెక్టర్ల ద్వారా అప్లికేషనులు పంపవలెనని, యిందుకు వలసిన అప్లికేషను ఫారముల నమూనాలు గుంటూరులోని కోలు ఫెడరేషను కార్యాలయములో కోరవచ్చనీ బాచిన సుబ్బారావుగారు వ్రాసిరి.

## నేటి పంచాంగం

విరోధి నామ సంవత్సర కార్తీక శు చతుర్దశి
1949 సం॥ నవం॥ 4 శుక్రవారం
... ర్దశి 12-9 ... 10.12 ... లేదు
శు పూర్ణిమ నవం॥ 5 శనివారం
శు పూర్ణిమ రా 2-38 అశ్వి ప 1-14 వర్జ్యం ప 8-43 ల 10-31 కు.

**ఆంధ్రపత్రిక**

విరోధి సం॥ కార్తీక శు॥ చతుర్దశి
శుక్రవారం

# హేగ్ ఒడంబడిక

పదివారముల పర్యంతము హేగ్‌లో సమావేశమైన డచ్-ఇండొనీషియను రౌండ్ టేబిల్ సభ మొన్న బుధవారము జయప్రదముగ ముగిసినదను వార్త ముఖ్యముగ ఆసియా ప్రజలకు అధిక తృప్తి నివ్వగలదు. రెన్విల్లీ ఒడంబడికవలెగాక, హేగ్ ఒడంబడిక నెదర్లెండ్స్ - ఇండొనీషియాల సఖ్యతకు ఆగ్నేయాసియాలో సుస్థిరశాంతికి దోహదము చేయుగాక యని ఆసియా రాజ్యములన్నియు ఆశించును. హేగ్ సమావేశము సాధించిన విజయమునకు ప్రధానముగ ఐక్యరాజ్యసమితి మధ్యవర్తిత్వ సంఘ పట్టుదల, కార్యదక్షత కారణమని చెప్పవచ్చును.

డచ్ ప్రభుత్వము గత డిసెంబరులో రెన్విల్లీ ఒడంబడికను ఉల్లంఘించి పెద్ద యెత్తున సైనిక చర్యలను ప్రారంభించినపుడు, ఆగ్నేయాసియా యావత్తు తిరిగి రణరంగము కాగలదను భావము సర్వత్ర వ్యాపించినది. ఐక్యరాజ్య సమితి మధ్యవర్తి సంఘము ఈ సైనికచర్యలను నివారింప లేకపోయెను. కాని తిరిగి ఇండొనీషియాలో యుద్ధమారంభమగుటకు డచ్ అధికారులే బాధ్యతవహింప వలసియుండునని భద్రతామండలికి పంపినని వేదికలో స్పష్టము చేసెను. అనంతరము భారత ప్రధానమంత్రి కృషి ఫలితముగ న్యూఢిల్లీలో జరిగిన ఆసియారాజ్యముల మహాసభ భద్రతామండలికి అంత్య సందేశ మంపుటతో హేగ్ అధికారులు తమ నిజస్థితిని గ్రహింప కల్గిరి. సైనికబలము వలన తమ సామ్రాజ్యమును నిలుపుకొనుట అసాధ్యమని గుర్తించిరి. తత్ఫలితముగ వివాదగ్రస్త విషయములను పరిష్కరించుకొని ఒక సమాధానమును సాధింపవలెనను సంకల్పముతో డచ్ అధికారులు ఈ హేగ్ సమావేశమును ఏర్పాటు చేసిరి. ఈ సమావేశము సఫలము కాదను సందేహములు కల్గినను తుదకు డచ్ ప్రధాని డ్రీస్ ప్రకటించినట్లు సమావేశములో పాల్గొనిన మూడు పక్షములవారు సమాధానమును సాధింప కృతనిశ్చయులై యున్నందున ఏ వర్గమునకు ఈ ఒడంబడిక పూర్తిగ సంతృప్తి పరచలేక పోయినను, ఐక్య ఇండొనీషియా స్థాపన, అభివృద్ధికి దోహదము చేయగల సమాధానము కుదిరినది.

గతానుభవమునుబట్టి ఈ ఒడంబడిక యెడల ఇండొనీషియా క్షేమము నాకాంక్షించువారు తమ సంతృప్తిని వెల్లడింప లేకుండిరి. డిసెంబరు మాసాంతములోపున స్వతంత్ర ఇండొనీషియా ఏర్పడినను, ఆ లోపున, అటుతరువాత డచ్ ప్రభుత్వము ఇప్పటి సమాధానవైఖరిని అవలంబింపకున్న ఇంతటి కృషి నిష్ఫలమగును. ఈ ఒడంబడిక యెట్లు అమలు జరుగునో పరిశీలించుటకు మధ్యవర్తుల నియమించుటకు ఏర్పాట్లు ఉన్నంత మాత్రమున ఒడంబడిక తృప్తికరముగ అమలు జరుగగలదని ఆశించుటకు వీలులేదు. డచ్ ప్రభుత్వము తన సైన్యమును పూర్తిగ స్వతంత్ర ఇండొనీషియా అవతరణకు పూర్వమే ఉపసంహరించుకొనిన తిరిగి సైనికచర్యలను ప్రారంభించుటకు గాని, ఎవరిబాధ్యత లేక సంఘర్షణలు జరుగుటకు గాని అవకాశము ఉండెడిదిగాదు. ఏమైనను ఉభయపక్షములు ఇప్పటి సమాధాన వైఖరితోనె ఇకముందు కూడ వ్యవహరించిన ఆగ్నేయాసియా శాంతి సుస్థిరమై ఇతర ప్రాంతములకు, ఇతర సామ్రాజ్య రాజ్యములకు మార్గదర్శకము కాగలదు.

# దూరప్రాచ్యంలో సహకార ఉద్యమ వ్యాప్తి ఆవశ్యకత

## లక్నో సమావేశ తీర్మానం

లక్నో, నవంబరు 2: ఆసియా దూర ప్రాచ్యాలలో సహకారోద్యమ వ్యాప్తికి సాధనోపాయాలు సూచించగలందులకై ఆహార వ్యవసాయసంస్థ ఆధ్వర్యాన ఇక్కడ 11 రోజులుగా జరుగుతున్న సహకారోద్యమ నిపుణుల సమావేశం నేటితో పరిసమాప్తమైనది. బొంబాయి ఆర్థిక సహకార శాఖామంత్రి వి. ఎల్. మెహతా సమావేశమునకు అధ్యక్షత వహించెను. ఆసియా దూరప్రాచ్యములలో సహకార సంస్థలను పోషించి వివిధ చేయగలందులకై ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ ప్రత్యేక శ్రద్ధవహించి పని చేయవలెనని సిఫార్సు చేస్తూ సమావేశంలో ఒక తీర్మానం చేయబడెను.

గ్రామసీమలలో ప్రజా క్షేమ సహకార సంస్థలయు, ఆర్థిక సహకార సంస్థలయు అభివృద్ధికి సాధనోపాయాలు సూచించగలందులకై లోగడ రెండు ప్రత్యేక సంఘములు నియమింపబడెను. ఈ సంఘములు తయారుచేసిన నివేదికలను కొన్ని చిన్నమార్పు చేర్పులతో సమావేశం ఈ వేళ ఆమోదించింది.

ప్రజాక్షేమ సహకార సంస్థల విషయమై సమావేశంచేసిన తీర్మానం ఇలా చెబుతున్నది.

ఒక గ్రామంలోగాని, కొన్ని గ్రామాలలో కలిసిగాని బహుళ ప్రయోజన సహకార సంస్థ ఒకటి ఏర్పడిఉండి అది కొన్నేళ్లుగా పరపతి, వస్తు క్రయ విక్రయాలను జయప్రదంగా నిర్వహిస్తు వున్నట్లయితే ఆ సహకార సంస్థలకే ప్రజాక్షేమానికి సంబంధించిన ఈ క్రింది కార్యకలాపాలను కూడా క్రమంగా అప్పగించవచ్చును :-

ఆరోగ్యం గ్రామ పారిశుధ్యం; వయోజనవిద్య; నిరక్షరాస్యతా నిర్మూలన; గృహ నిర్మాణం. ప్రజాక్షేమ సహకార సంస్థలకు సంబంధించిన ఈ తీర్మానాన్ని భారత ప్రతినిధి హెచ్. ఎల్. కాజీ ప్రతిపాదించెను. వీరే లోగడ ఇందుకు సంబంధించిన ప్రత్యేక కమిటీకి అధ్యక్షత వహించిరి.

నదులలోను సముద్రంలోను చేపలు పట్టడం, నిల్వచేయడం, అమ్మడం, ఈ వ్యాపారంకూడా సహకారసంఘాల చేతిమీదుగానే జరగాలనీ, ఆయాదేశాల ప్రభుత్వాలు చట్టరీత్యా దీనికోసం కావలసిన శాసనాలు చేయడమేగాక ఆర్థికంగా సాయంకూడా చేయాలనీ సమావేశం మరోతీర్మానంచేసింది. గ్రామపరిశ్రమల విషయమై సమావేశం ఈ క్రిందివిధంగా సిఫార్సు చేసింది :-

వివిధప్రాంతాలలో ఏయే గ్రామపరిశ్రమలు అభివృద్ధిలోకి వస్తున్నదీ సర్వేచేసి ఫ్యాక్టరీసరుకుతో పోటీచేయగల గ్రామ పరిశ్రమలు ఏమైనా ఉంటే వాటిని సహకారసంస్థల చేతిమీదుగా నిర్వహించడానికి ప్రభుత్వం ఏర్పాట్లుచేయాలి."

ఎక్కడైనా ప్రభుత్వభూములనుగాని, ప్రైవేటు భూములనుగాని రైతులకు పెద్ద ఎత్తున ఇవ్వడానికి అవకాశం ఉన్నట్లయితే, వాటిని వీలైనంతవరకు సహకార సంస్థలపరంగా ఇవ్వడం మంచిదని చెబుతూ మరోసిఫార్సు చేసిరి.

అన్ని భీమాసంస్థలను, జనరల్ భీమా సంస్థలను సహకార పద్ధతిని సంఘటితపరచడానికి ప్రయత్నించవలెననీ, పంట భీమాను, పశువుల భీమాను సహకార పద్ధతిని నిర్వహించడానికి ప్రభుత్వంప్రయోగార్థం ముందు స్వయంగా కొన్ని సంస్థలను పెట్టి నడిపించాలనీ సిఫార్సు చేస్తూ, సమావేశం మరో తీర్మానం చేసింది :

సమావేశాంతాన అధ్యక్షుడు వి. ఎల్. మెహతాగారు ఉపసంహార వాక్యాలు పలుకుతూ, ఈ తీర్మానాలకు వివిధ దేశాల ప్రభుత్వాలు తగిన ప్రాధాన్యం ఇవ్వగలవని ఆశిస్తున్నాననీ, ఇతర ప్రభుత్వముల మాట ఏమైనా భారత ప్రభుత్వంమాత్రం సహకారోద్యమ ప్రాముఖ్యాన్ని గుర్తించినదనడంచేత, ఈ సిఫార్సులయెడ తగిన శ్రద్ధ వహించగలదని తాను చెప్పగలననీ అన్నారు. సమావేశమును జయప్రదంగా నిర్వహించినందుకు ప్రాగ్దక్షిణ ఆసియా దేశాల ప్రతినిధులకు ఆయన కృతజ్ఞతాభివందనములను అర్పించెను.

సమావేశం అక్టోబరు 24 వ తేదీన ప్రభుత్వ భవనంలో ప్రారంభమైంది. ఇండియా, పాకిస్థాన్, ఆస్ట్రేలియా, సిలన్, థాయ్‌లాండ్, ఫ్రాన్స్, ఇంగ్లండుల ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొనిరి.

# భారతరాజ్యాంగ ఆదర్శమునకు అనుగుణంగా మన విద్యావిధానం అమలు జరగాలి

## మైసూరు విశ్వకళాపరిషత్ స్నాతకోత్సవంలో డా॥ శ్యామప్రసాద ముఖర్జీ ఉద్ఘాటన

మైసూరు, నవంబరు 3: "నూత్న భారతరాజ్యాంగంలో ప్రతి పౌరుడికీ న్యాయం జరుగుతుందనీ, స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం పెంపొందింప బడతాయని హామీ లివ్వబడినవి. ఈ ఆదర్శమునకు అనుగుణంగా మన విద్యావిధానం అమలుజరగాలి. దేశమునకు ఆర్థిక స్వాతంత్ర్యం లభించేటట్లు, ప్రజలజీవన ప్రమాణం వృద్ధిఅయ్యేటట్లు, దేశమంతా ఒకే జాతిగా ప్రవర్తిల్లేటట్లు చేయటానికి మన యూనివర్సిటీ విద్యావిధానం ఒక విశాల దృక్పథము నలవరచుకోవాలి. దేశంఆహారరీత్యా స్వయంపోషకమయ్యేట్లు, కొఱత, రోగము, అజ్ఞానము నిర్మూలనమయ్యేట్లు, చేయవలసిన బాధ్యతకూడా మన యూనివర్సిటీ మీద ఉన్నది." అని భారత పరిశ్రమల శాఖామంత్రి డా॥ శ్యామప్రసాద ముఖర్జీ మైసూరు విశ్వకళా పరిషత్తు స్నాతకోత్సవం లో ఉపన్యసిస్తూ చెప్పారు.

ఉపన్యాసంలో డా॥ ముఖర్జీ ఇంకా ఈ క్రింది ముఖ్య విషయాలను గూర్చి ఉద్ఘాటన చేశారు.

"యూనివర్సిటీలు నిర్వర్తింపవలసిన బాధ్యతలు బహుక్లిష్టమైనవి, ప్రధానమైనవి. మనదేశంలో వయోజన ఓటింగు విధానం త్వరలో ఆచరణకు రానున్నది. ఈ విధానం జయప్రదంగా అమలు కావలెనంటే, వయోజనవిద్య ముఖ్యమైన మరకు. వయోజనవిద్యాబాధ్యతను మన యూనివర్సిటీలు స్వీకరించి నిర్వర్తించవలసి వున్నది.

ఆసేతు శీతాచల పర్యంతమైన భారత వర్షంలో వివిధములైన అనేక సంస్కృతులు పాదుకొని ఉన్నాయి. ఏ సమాజమైన సుస్థిరము కావలెనంటే సాంస్కృతిక ఏకత్వం ఉండి తీరాలి. ఈ ఏకత్వమును యూనివర్సిటీలే నిర్మించవలసి వున్నది. భాషలకు తల్లియైన సంస్కృతమును పునరుద్ధరించాలి. దేశమంతటా ఒకే దేవనాగరిలిపి వాడుకలో ఉండేట్లు చేయాలి."

రాజకీయాల్లో విద్యార్థుల పాత్రను సూచ్చి చెబుతూ, పార్టీ రాజకీయాల జోలికి పోకుండా వారు సాంఘిక, రాజకీయ సమస్యలలో ఆసక్తిని చూపుతూ వుండాలని డా॥ ముఖర్జీ ఉపదేశించారు.

"రాజకీయాలలోను, పరిపాలనలోను, వివిధవృత్తులు, పరిశ్రమలు, వ్యాపారములోను ప్రతిభావంతంగా ముందుకు పోగల సమర్థులను యూనివర్సిటీలే తయారు చెయ్యాలి. పోస్టుగ్రాడ్యుయేట్లకు ట్రెయినింగు, రిసెర్చి సౌకర్యాలను కల్పించటం, వివిధ యూనివర్సిటీలలో జరిగే పరిశోధనలను సంధానపరచటంకూడా అత్యవసరం. మనదేశానికీరోజుల్లో ప్రమాదకర సమస్యగా పరిణమించిన ఆహార లోపాన్ని తొలగించేందుకు వ్యవసాయశాస్త్రంలో ఏటేటా అధిక సంఖ్యాకులైన నిపుణులను తయారు చెయ్యాలి. ఇంజనీరింగు, టెక్నాలజీ విద్యలు కూడ ప్రోత్సహింప బడాలి. వచ్చే పదివేళ్లకు మనకు 27 వేల టెక్నికల్ నిపుణులు కావలసి వున్నారు. ఇండియాలో ఏటా 1100 మంది నిపుణులు మాత్రమే తయారవుతున్నారు. ఈలోపాన్ని భర్తీ చెయ్యాలంటే, కనీసం నాలుగు ఉన్నత టెక్నాలజికల్ విద్యాలయములైనా తూర్పు పడమరల, ఉత్తర దక్షిణాల స్థాపించవలసి వున్నది.

ఈ అవసరాన్ని ప్రభుత్వం గుర్తించి ప్రస్తుతం బెంగాల్, బొంబాయిలలో రెండు సంస్థలను స్థాపిస్తున్నది.

టెక్నికల్ విద్యలలో ఉత్తీర్ణులైన వారిని పారిశ్రామికులు ఇతోధికంగా ఉపయోగించుకోవాలని డా॥ ముఖర్జీ సూచించారు.

పురుషులకు స్త్రీలకు ఒకే రకమైన విద్య ఇవ్వవలసిన అవసరం లేదని, ఉపాధ్యాయత్వం, సాంఘిక సేవ, నర్సింగు మొదలైన వృత్తులు స్త్రీల కెక్కువ తగి వుంటాయనీ, ముఖర్జీ అన్నారు.

ప్రజల విజ్ఞానాభివృద్ధికై పాటుపడుతున్న మైసూరు ప్రభుత్వాన్ని డా॥ ముఖర్జీ అభినందించారు. మైసూరులో యంత్రపరికరముల ఫ్యాక్టరీనొకదానిని స్థాపించటానికి భారత ప్రభుత్వం నిశ్చయించినదనీ, ఇది భారత ప్రభుత్వ యాజమాన్యం క్రిందనే నడుస్తుందనీ కూడా ఆయన వెల్లడించారు.

## బాలభారత్

మదరాసు, నవంబరు 3: శ్రీ జి. వి సుబ్బారావుగారు, విద్యావేత్త (అడయారుస్కూలు మాజీ హెడ్‌మాస్టరు) సాబీబుల్లారోడులో (త్యాగరాయనగరు) స్థాపించిన బాల భారత్ పాఠశాలయందు, వారి 55 వ జన్మదినోత్సవం జరిగెను. మంత్రి సంజీవరెడ్డిగారు, సుబ్బారావుగారి శిష్యులు స్వయంగావచ్చి వారి నభినందించిరి. వి. ఎన్. శర్మగారు (బాలోద్యానవనం పాఠశాల యజమానులు) ఎస్. ఆర్. వెంకట్రామనుగారు, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటీ ఉపన్యసించుచు, సుబ్బారావుగారు పసిబిడ్డల విద్యగూర్చి చేస్తున్న కృషిని ప్రశంసించి, వారికి అందరు తోడ్పడవలెనని కోరిరి. సుబ్బారావుగారు ప్రత్యుత్తర మొసంగుచు, సుమారు 60 మంది బిడ్డలకు నివాసయోగ్యమగు పాఠశాల స్థాపించ దలచితిమని చెప్పిరి. అల్పాహారముల విందు జరిగెను.

## ఆంధ్రశాఖ కార్యవర్గ సమావేశం

విజయవాడ, నవంబరు 2: తుఫానువల్ల నష్టతినిన విజయవాడ - బందరు రైలు మార్గము ఇంతవరకు, బాగుపడ నందువలన ఈ నెల 6 వ తేదీన బందరులో జరుగనున్న సమితి ఆంధ్రశాఖ కార్యవర్గ సమావేశము బందరులోగాక విజయవాడలో గోష్ఠి విద్యాలయమునందు ఆ తేదీనే సాయంత్రం 4 గంటలకు జరుగును.

# నెహ్రూ - హాల్ ఉత్తర ప్రత్యుత్తరాలు

( 1-వ పేజీ తరువాయి)

సుశోభితమూ-మంచి సత్ఫలితాలను ఇవ్వగలదు. ఇందువల్ల రెండుప్రాంతాల ప్రజల మధ్య సహకార సామరస్యాలు పెంపొందితే, ప్రపంచంలోని, స్వాతంత్ర్య కాముకములైన దేశాలకూ ప్రజలకు శాంతి భద్రతలు లభించే సావకాశం వుంటుంది.'

'మీరు ఎత్తిచూపిన ఆదర్శాలకోసం, నేను అధికారంలో వున్న తరుణంలోనూ, బయటవున్న తరుణంలోనూ కూడా కృషి చేసినమాట నిజమే. ఇందుతో నా గ్రంథాలని పంపుతున్నాను. వీటిని చిత్తగించితే నా కృషి వివరాలు తమకు తెలుస్తవి. మనమిద్దరం ఏకార్థ సమేతులం. ఇవే ఆదర్శాలకొరకు తమరుకూడా కృషి చేస్తూవుండటం గమనించి యెంతో ఆనందిస్తూవున్నాను.'

# "మధ్యవర్తిత్వ వార్త అబద్ధం"

(1 వ పేజీ తరువాయి)

అమెరికాలో పెట్టిన దానికంటే వారికి ఇండియాలో పెడితే వచ్చే లాభమేమిటి ?

ఈ దేశములో వారు పెట్టే పెట్టుబడులకు ఏమిలాభాలువస్తున్నాయో, అందుకు వారు ఏమి కష్టాలుపడుతున్నారో నాకు తెలియదు. కాని మాదేశంలో గనుక వారు పెట్టుబడ్లు పెడితే మా దేశంలో పెట్టుబడ్లపట్ల ఎటువంటి ఆదరణను చూపుతున్నామో, అదే ఆదరణను వీరిపట్లగూడా చూపుతాం.

కైబరులోయగుండా మీదేశం మీదికి దండయాత్రలు జరుగవచ్చునని మీరు భావిస్తున్నారా?

కైబరుకనుమ ఇప్పుడు మా దేశంలో లేదు. అది పాకిస్థాన్‌లో వుంది!

కాశ్మీర్, హైదరాబాదు సమస్యల పట్ల ఇండియా పాకిస్థాన్‌ల విధానాలు ఎటువంటివి?

మీప్రశ్న నాకు సరిగ్గా అర్థంకాలేదు. అయినా హైదరాబాదు ఇండియామీద యుద్ధానికి తలపడ్డది. అందుకు అపరిమిత ప్రయత్నం చేసింది. ఈ ప్రయత్నాలకు పాకిస్థాన్‌గూడా కొంత దోహదం కల్పించింది. కొంతమంది ఇంగ్లీషువాళ్లుగూడా సహాయపడ్డారుగాని, వారంతా ఇప్పుడు తగిన శిక్ష అనుభవిస్తున్నారు.

హైదరాబాదు సంస్థానంలో కల్లోలం ప్రారంభమైంది. ప్రజలు కాందిశీకులై పారిరావడం ప్రారంభించారు. అప్పుడు ఇండియా గనుక చేయిచేసుకోకపోయినట్లయితే, దక్షిణ భారతం అంతా కల్లోలితమై పోయి వుండేది.

ప్రెస్‌క్లబ్బువారు ఏర్పాటుచేసిన ఈ విందుకు అతిథులు ఎక్కువగా వచ్చారు. ఇదివరకు ఎప్పుడూ ఇంతమంది సభ్యులు ఏవిందుకు హాజరై వుండలేదని క్లబ్బు అధ్యక్షుడు అన్నారు.

ఈ క్లబ్బుకు చిహ్నంగా ఒక నల్లపిల్లి శిలావిగ్రహం వుంది. అది కళ్లుమూసుకువున్నట్లు చెక్కబడిఉంది. నిశ్శబ్దంగా వుండాలన్న దాని ఆకళ్ళుమూత గుర్తు అని ఆచిహ్నాన్ని ఏర్పాటు చేయడంలోవున్న అర్థమట. ఇవ్వాళ ఆకళ్ళుమూత నల్లపిల్లి శిలావిగ్రహాన్ని తొలగించివేసారు.

మహాత్మ గాంధీ - ఉదంతాలతోను, ఆయన ... ప్రజల లోనాటి నకథలతోను, పండిట్ నెహ్రూ వారి ఉత్సాహ ఉద్రేకాలను ఇనుమడింపజేసారు.

ప్రెస్ క్లబ్బు అధ్యక్షుని ప్రార్థనను పురస్కరించుకొని పండిట్ నెహ్రూ భారత సంస్థానాధీశుల స్థితిగతులనుగూర్చి మాట్లాడారు.

భారత సంస్థానాధీశుల అందరికీ మంచి వార్షిక భృతులను ఏర్పాటుచేసాం. ఇండియాతో కలిసిన సంస్థానాలలో ప్రజాస్వామిక వ్యవస్థలను నెలకొల్పాం. ఒక్క హైదరాబాదు, కాశ్మీర్‌ల విషయంలో తప్ప, తక్కిన 600 సంస్థానాలు. కక్కురు మనకుండా మేము చెప్పినట్లు విన్నాయి.

ఇంకో రెండు మూడు నెలలలో హైదరాబాదులో రాజ్యాంగపరిషత్తు ఏర్పాటు కాబోతున్నది. దాదాపు వయోజన ఓటింగు పద్ధతిమీద ఇది ఏర్పడుతుంది. ఆ పరిషత్తులో నిజాం భవిష్యత్తు తేలుతుంది.

ప్రస్తుతం హైదరాబాదులో ఒక సివిల్ ప్రభుత్వం నడుస్తున్నది. దానికి అధినేతగా ఒక మిలిటరీ ఉద్యోగి ఉన్నప్పటికీ దాన్ని మిలిటరీ గవర్నమెంటు అనేందుకు వీలు లేదు.

కాశ్మీర్ విషయంలో ఇతర దేశాలలో అది చాలా అపార్థాల పాలైపోయింది. కాశ్మీర్‌లో ముస్లిములు ఎక్కువగా వున్నారు కాబట్టి, ఇండియాకు అందులో ఎటువంటి ప్రమేయమున్నూ వుండటం అనవసరం అనుకోటంకన్నా అపభ్రంశమైన ఆలోచన ఇంకొకటిలేదు.

ఈరకంగా అర్థం లేని ఆలోచనలు జరుగుతూ వుండటానికి కారణం చాలావరకు ముస్లింలీగు ద్విజాతి సిద్ధాంతమని చెప్పవలసి వుంది. దాన్ని ఇండియా ఎప్పుడూ అంగీకరించలేదు. పోతే దేశవిభజనను అంగీకరించామంటే దానికి ఇది కారణం కానేకాదు.

దేశవిభజనను, అంగీకరించిందని ఇండియా జాతిద్వయ సిద్ధాంతాన్ని కూడా అంగీకరించిందని వాదించడంకన్నా అసంగతమైన విషయం ఇంకొకటి లేదు. నిజానికి ఇండియాలో ఈ విభజన అంగీకరించినవారు శాసన సభికులుగాని, ప్రజలుకాదు. ప్రజలముందే గనుక ఈ సమస్యను వుంచినట్లయితే, వారు ఈ విభజనకు వ్యతిరేకంగా ఓటు చేసివుండేవారు.

పోతే ఇండియా ఈ విభజనను సత్వర స్వాతంత్ర్య సముపార్జనకోసం మాత్రమే అంగీకరించింది.

ఇంకా ఇండియా విభజన అంటూ జరక్కముందే, కాశ్మీర్‌లో అధిక సంఖ్యాకులకు, అంటే ముస్లింలకు, ప్రాతినిధ్యం వహిస్తున్న కాశ్మీర్ జాతీయ మహాసభ ఈ జాతిద్వయ సిద్ధాంతాన్ని అంగీకరించింది. ఇప్పుడు పాకిస్థాన్ దీనికు ప్రమేయం లేనిచోట, ప్రవేశించడానికి అధికారం లేనిచోట దురాక్రమణబుద్ధితో ప్రవేశించింది.

కాశ్మీర్ నిరాపడిన దురాక్రమణ దారులకు పాకిస్థాన్‌లో స్థావరాలు వున్నాయి మేము వాటిని పట్టుకోలేక పోలేదు. కాని ఆ పద్ధతి మాకునచ్చలేదు. అందువల్లనే మేము ఐక్యరాజ్య సమితిముందు ఆ విషయాన్ని పెట్టాము. పాకిస్థాన్ ఈ దురాక్రమణ దారులకు సహాయం చేస్తోంది. అది అన్యాయపోరం మానుకునేటట్లుచూడండి అని సమితిని మేము అర్థించాం.

ఇండియా తెచ్చిన అభియోగంలో నిజంవుందో, లేదో, కాని భద్రతా సంఘం ఆరునెలలపాటు పూరికే కూర్చుంది.

అప్పటికి పాకిస్థాన్ తన సైన్యాలు కాశ్మీర్‌లో వున్నమాట నిజమేనని అంగీకరించక, అంగీకరించక, అంగీకరిస్తూ, తన పరంగావున్న ప్రాంతాలను రక్షించుకోవటం కోసం వున్నట్లు సమితికి విన్నపం చేసుకుంది.

అంటే మేము పాకిస్థాన్ మీద పడదలచినట్లయితే నూటికిగా పడకుండా, డొంక తిరుగుడుగా కాశ్మీర్‌లోంచి పడతామని సమితిని పాకిస్థాన్ నమ్మపెట్ట జూచింది.

కాశ్మీర్‌లో పాకిస్థాన్ తన సైన్యాలనేగాక, చెదురుపాటుగా గూడా కొన్ని సైన్యాలను నిలిపింది. ఈ దురాక్రమ దారులను పారద్రోలడానికే ఇండియా కాశ్మీర్‌లో ప్రవేశించింది. పాకిస్థాన్‌కు అక్కడ ప్రవేశించే అధికారం ఏకోశానా లేదు.

అట్టావాలో మాట్లాడుతూ నేను పాకిస్థాన్‌ను మతైక రాజ్యంగా వివరించి వున్నాను. కాని ఇది సరికాదంటూ పాకిస్థాన్ ప్రతినిధి ఒక ప్రకటనచేస్తూ, నేను అచ్చట ముస్లిమేతరులకు మంచి ఉద్యోగాలు ఇవ్వడంలేదని అన్నదాన్ని గూడా విమర్శించాడు.

పాకిస్థాన్, మతైకరాజ్యమో, కాదో మన కెందుకుగాని, పాకిస్థాన్ పరిపాలకులే చాలా మంది దానిని ఇస్లామిక్ రాజ్యంగా వర్ణిస్తున్నారు.

కాని ముస్లిమేతరులకు పెద్ద ఉద్యోగాలు లేవని నేనన్నమాటలో మాత్రం ఆయనకు పట్టుబడిపోయాను. ముస్లిమేతరులు అని నేనుఅన్నదాన్ని స్వదేశస్థులు అన్న అర్థంలోవాడాను కాని అక్కడ పెద్ద ఉద్యోగాల్లోవున్న ఇంగ్లీషువాళ్లు, తదితర దేశీయులనుగూర్చి కాదు.

ఇవికాక ఇంకా ఇంకా రెండు సమస్యలు ఇండియాపాకిస్థాన్‌లు పరిష్కరించుకోవలసివుంది ఒకటి శరణార్థుల ఆస్తికి సంబంధించింది. రెండవది పంజాబ్ కాలువనీటి పంపకానికి సంబంధించింది.

ఈ రెండు సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకుందామని పాకిస్థాన్‌కు నేను విజ్ఞప్తిచేసివున్నాను. పాకిస్థాన్ దానికి ఇంతవరకు ఎటువంటి ప్రత్యుత్తరమూ ఇవ్వలేదు.

కాని పాకిస్థాన్‌లో మాత్రం శాంతియుత పరిష్కారం యోగ్యంకాదన్న వాదనకు బలంవున్నటు వార్తలు వస్తున్నాయి. యుద్ధంతో వీటిని పరిష్కరించుకోవాలన్న కోరిక అక్కడ ఎక్కువగావున్నట్లు గోచరిస్తున్నది.

కాని ఈ సమస్యల్లో ఏదీ గూడా భద్రతా సంఘం ముందుకురాదు.

పత్రికా విలేఖరులతో నెహ్రూ గోష్ఠి రాత్రి 12 గంటలదాకా జరుగుతునే వుంది.

# ఇండొనీషియాకు స్వాతంత్ర్య ప్రదానం

(1 వ పేజీ తరువాయి)

కమిషన్ ఇంతవరకు చేసిన సహాయానికి కృతజ్ఞత తెల్పుతూ, ఇకమీద సమావేశ ఒడంబడికలను ఉభయపక్షాలు ఏవిధంగా అమలు జరిపేదీ పర్యవేక్షించే భారమునుకూడా కమీషనే స్వీకరించినందుకు ధన్యవాదాలు అర్పించెను. అటుపిమ్మట ఫెడరలిస్టు ప్రతినిధివర్గ నాయకుడు సుల్తాన్ హమీద్ మాటలాడుతూ, నడమంతర కాలంలో ఇండొనీషియా ప్రభుత్వ పర్యవేక్షణకింద డచ్చి సైన్యాలే ఇండొనీషియాలో శాంతిభద్రతలను కాపాడుతూ ఉండుననీ, అధికార ప్రదానం సక్రమంగా శాంతియుతంగా జరగవలసిన ఆవశ్యకతను గుర్తించి అందుకు తగిన ఏర్పాట్లను డచ్చివారు చేయటం ప్రశంసనీయమనీ చెప్పెను.

ఐక్యరాజ్య సమితి కమిషన్ తరఫున బెల్జియన్ ప్రతినిధి రేమండ్ హెర్మన్సు మాట్లాడుతూ, ఒక మహత్తరమైన సంఘటనకు సాక్షులయే భాగ్యం తమకు దొరికిందనీ, ఉభయదేశాల పార్లమెంటులు ఈ ఒడంబడికలను సాధ్యమైనంత త్వరగా ఆమోదించ గలవని ఆశిస్తున్నాననీ, చెప్పెను.

ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాల భవిష్యత్తు ఫలప్రదంగా ఉజ్వలమై ఉండగలదని కమీషన్ ఆశిస్తున్నదనీ తాను ఈ పరిస్థితిలో చూపిన రాజనీతిజ్ఞతకు దూరదృష్టికి తగిన ప్రతిఫలాన్ని నెదర్లాండ్సు ఉత్తరోత్తరా పొందక తప్పదనీ, హెర్మన్సు అన్నాడు. ఇండొనీషియాకు స్వతంత్ర ఫెడరేషన్ హోదా కల్పించే ఈ తీర్మానంపై సంతకాలు రాత్రి 9 గం.కు (భారతీయ కాలమానం) జరిగినవి. తీర్మాన ప్రతులమీద వివిధ ప్రతినిధి వర్గనాయకులు కమిషన్ సభ్యులు సంతకాలు చేయడం పూర్తి అయిన తర్వాత, సమావేశాధ్యక్షుడు డ్రీస్ ఉపసంహార వాక్యాలు పలుకుతూ ఇండొనీషియా నేటినుంచి సౌభాగ్యపథాన పురోగమించగలదని ఆశిస్తున్నాననీ, అనేక డచ్చి ఇండొనీషియన్ ప్రాణులను అహుతిగొన్న విషాద సంఘటనలు నేటితో పరిసమాప్తం కాగలవని విశ్వసిస్తున్నాననీ చెప్పెను.

## ఒడంబడికల సారాంశం

హేగ్, నవంబర్ 2: ఈవేళ జరిగిన అంతిమ సర్వసభ్య సమావేశంలో అధికార ప్రధాన ఒడంబడిక, నెదర్లాండ్సు-ఇండొనీషియా సమితి రాజ్యాంగ ఒడంబడిక, నడమంతరపు ఏర్పాట్లకు అనగా అధికార ప్రదానానికి ముందున్న వ్యవధిలో చేయవలసిన ఏర్పాట్లకు సంబంధించిన మరో ఒడంబడిక, నిశ్చేరించబడినవి.

230 మంది నిపుణులు 72 రోజులు అహోరాత్రాలు కృషిచేసి ఈ ఒడంబడికలను సాధించిరి.

న్యూగినీ భవిష్యత్తుతప్ప తక్కిన అంశాలన్నీ పరిష్కారమైనవి. న్యూగినీ భవిష్యత్తు నిర్ధారణ అయేవరకు అనగా ఒక సంవత్సర కాలంపాటు యథాపూర్వంగా డచ్చివారి పరిపాలనకిందనేఉంటుంది. సాలీనా ఉభయదేశాల మంత్రివర్గాలు రెండుసార్లు సంయుక్తసమావేశాలు జరపాలనీ, మంత్రివర్గ సమావేశనిర్ణయాలను ఉభయదేశాల పార్లమెంటులూ ఆమోదించాలనీ నిర్ణయించబడెను. ఇండొనీషియా నెదర్లాండ్సులోను, నెదర్లాండ్సు ఇండొనీషియాలోను హైకమిషనర్‌లను నియోగించుకొంటవి. ఖర్చులు సమానంగా పంచుకోవడం అవుతుంది. నెదర్లాండ్సు సైన్యాలు ఇండొనీషియా నుండి "సాధ్యమైనంత త్వరగా" ఉపసంహరించబడును. ముందు అనుకొన్నట్లు 6 నెలలలో ఉపసంహరణ సాధ్యంకాదని అనుకుంటున్నారు. డచ్చి నౌకాసైన్యాలు "ఒక సంవత్సరంలోగా ఉపసంహరింపబడుననీ, నూతన రాజ్యానికి నౌకాబలాన్ని నిర్మించి పెట్టడంలో నెదర్లాండ్సు తోడ్పడగలదనీ" ఖరారుచేసుకున్నారు. సురబయా, ఇండొనీషియా ప్రభుత్వ పర్యవేక్షణ కింద డచ్చి నౌకాధికారి నిర్వహణలో ఉంటుంది.

నెదర్లాండ్సు నిర్మించిన ఇండొనీషియన్ సైన్యం ఇండొనీషియా ఫెడరేషన్ సైన్యంలో లీనంచేయబడుతుంది; కాని రాయల్ ఇండొనీషియన్ సైనికులు ఎవరైనా డచ్చి సైన్యంలో చేరదలచుకుంటే నిరభ్యంతరంగా చేరవచ్చును.

డచ్చి సైనిక రాయబారవర్గం ఒకటి ఇండొనీషియాలో మూడేళ్లు ఉండి నవ్య ఇండొనీషియా సైన్య నిర్మాణంలో తోడ్పడుతుంది.

సమితిలోని భాగస్వాము లిద్దరూ బ్రెట్టన్‌వుడ్స్ ఒడంబడికను ప్రాతిపదికగా స్వీకరించి తమ ఆర్థికవిధానములను సవ్యమైనవిధంగా రూపొందించుకొనుటకు ప్రయత్నించగలరు. రెండుదేశాలు వచ్చే 12 నెలల పాటు యూరపీయ దేశాలతో వాణిజ్యములో పరస్పరం సహకరించుకోగలరు. ఆతర్వాత ఏవిధానం అవలంబించవలసింది తదనంతరం నిర్ణయించబడుతుంది. యూరోపియేతర దేశాలలో విడివిడిగా వాణిజ్య రాయబారవర్గాలు ఏర్పరుచుకోవడం అవుతుంది; కాని అవి వీలైనంత సన్నిహితంగా ఉండి సహకరించుకోడానికి ప్రయత్నిస్తు ఉంటవి. 1949 అక్టోబర్ నుండి ఒక సంవత్సరకాలంపాటు వర్తించే వాణిజ్యఒడంబడిక ఒకటి వ్రాసుకోవడం అయినది. ఇండొనీషియా 430 కోట్ల గిల్డర్ల ఋణభారాన్ని అప్పగించుకోడానికి అంగీకరించింది. డచ్చి సివిల్ ఉద్యోగుల వేతనాలు 2 ఏళ్లవరకు మార్పు చేయబడవు. ఉద్యోగుల బాధ్యత ఇండొనీషియా స్వీకరిస్తుంది. ఐక్యరాజ్యసమితిలో ఇండొనీషియా ఫెడరేషన్‌కు సభ్యత్వమిప్పించడానికి నెదర్లాండ్సు తోడ్పడగలదు.

# నెహ్రూకో - పైలట్‌గా కొంత సేపు విమానం నడుపుట

శాన్‌ఫ్రాన్సిస్కో, అక్టోబరు 31: పండిట్ నెహ్రూ నాక్స్‌విల్లీనుంచి వస్తూవుండగా కొంతసేపు విమానాన్ని నడిపినట్లు ఇప్పుడు తెలియవచ్చింది.

లూయీ జాన్సన్ విమానంలో ఆయన నాక్స్‌విల్లీనుంచి వస్తూవుండగా, 10 నిమిషాలసేపు కో - పైలట్ స్థానంలో కూర్చుండి, పైలట్ చెప్పినట్లుగా వింటూ విమానాన్ని నడిపినట్లు ఆయన అనుచర బృందం నేడు వెల్లడిచేసారు.

# బుడమేరు వరద: విజయవాడలో తుపాను బీభత్సం

విజయవాడలో పెనుగాలి దెబ్బకు తాళలేక పెద్దపెద్ద చెట్లన్నీ ఈ విధంగా ఫెళ ఫెళ విరిగిపోయినవి. ఈ విధంగా పడిన ఒక చెట్టుదెబ్బకు కూలిపోయిన పెంకుటిల్లు.

తుపానులో విజయవాడ కళాశాల, దాని హాస్టలుభవనమూ కూడా బాగా దెబ్బ తిన్నది. పూర్తిగా దెబ్బతిన్న హాస్టల్ దృశ్యం.

విజయవాడలో రైల్వే గూడ్సు షెడ్డువద్ద బుడమేరు వరదవల్ల మునిగిపోయిన కార్మిక నివాసాలు.

బుడమేరు వరదలవల్ల జలమయమై దెబ్బతిన్న కంసాలిపేట. (విజయవాడ)

బుడమేరు వరదఫలితంగా ఇళ్లు, వాకిళ్లు కొట్టుకొనిపోగా, కొన్నిచోట్ల కాపు కాల్చుకున్న ప్రజల దృశ్యం.

# కృష్ణాజిల్లాకు తుపాన్ దెబ్బ: నష్టాన్ని వివరించే ప్రత్యేక చిత్రాలు

గన్నవరంవద్ద రైలుమార్గాన్ని మరమ్మతు చేస్తున్నదృశ్యాలు: బెజవాడ గన్నవరం మధ్య రైలుమార్గం విపరీతంగా దెబ్బతినిపోయింది. మరమ్మతు జరుగుతున్నా ఆ నష్టాన్ని ఈ చిత్రాలు కొంతవరకు వివరిస్తున్నది.

విజయవాడ రైలుస్టేషనులోని ప్రయాణీకుల షెడ్ పైపెంకులు ఎగిరిపోయినవి, వర్షంవల్ల లోపల ఉండేందుకు ప్రయాణీకులకు వీలుగాక పోయింది.

1. గుడివాడలో ఒక ఇల్లు కూలిపోవడంవల్ల ముగ్గురు మరణించారు. వారి శవాలు ఈ చిత్రంలో కానవచ్చును. 2. బుడమేరు వరదలవల్ల జనార్దనపురం అంతా జలమయమైపోయింది. తుపానును తట్టుకున్న ఇళ్లల్లో నీరు చేరడంవల్ల ఉండడానికి వీలుగాకుండా పోయింది.

## వ్యవసాయ సంస్కరణల సంఘం సూచనలు

(1 వ పేజీ తరువాయి)

(1) వ్యవసాయ వ్యవస్థవల్ల రైతు వ్యక్తిత్వం సర్వతోముఖంగా అభివృద్ధి చెందాలి.

(2) ఒక వర్గం మరి ఒకవర్గాన్ని దోచుకోడానికి ఎంతమాత్రము అవకాశం ఉండ కూడదు.

(3) వీలైనంత ఎక్కువగా ఉత్పత్తి చెయ్యడానికి అవకాశాలు కల్పించాలి.

(4) సంస్కరణలు ఆచరణయోగ్యంగా ఉండాలి.

(5) ఒక్కొక్క రైతుకు ఎంతెంత భూమి ఉండాలి అన్న విషయం ఆయా ప్రాంతాల ఆర్థికానుకూలాన్ని బట్టి నిర్ణయించాలి. ఒక రైతుకు ఎంత వరకు ఎక్కువభూమి ఉండాలోకూడా సంఘం సూచించింది. అయితే కొన్నికొన్ని సందర్భాలలో ఈ సూచనలకు సడలింపులు ఉండవచ్చుననికూడా ఈ సంఘంవారు అభిప్రాయపడ్డారు.

ఈ సంఘం సహకార పద్ధతిని వ్యవసాయం చేయించడం అవసరమని సూచిస్తూ ఇది క్రమక్రమంగా అమలులోకి రావాలని వ్రాసింది.

వ్యవసాయపరిశోధనకు ప్రభుత్వ అధీనంలో కొంతభూమి ఉండడం అవసరమని కూడా ఈ సంఘం నిర్ణయించింది. భూమి హక్కు విషయంలో ఈ సంఘం కొన్ని కొత్త సూచనలు చేసింది. వ్యవసాయం బాగా సాగాలంటే భూమి హక్కు దారు తన ఇష్టం వచ్చినట్టు భూమిని వినియోగ పరచడం మంచిది కాదని అభిప్రాయపడింది. కొన్ని నియమాలకు లోబడి రైతు భూమిని దున్నుకోవాలని కూడా ఈ సంఘం వారు అభిప్రాయ పడ్డారు.

ఈ సంఘం ఆ తరవాత వ్యవసాయదారుల ఋణాలను గురించి చర్చిస్తూ ధాన్యం ధరలు ఎక్కువయినా రైతుల ఋణ భారం తగ్గలేదనీ రైతుల ఆర్థికావస్థ ననుసరించి వారి ఋణాలు క్రమంగా రద్దు పరచాలని అభిప్రాయ పడింది. వ్యవసాయ కూలీలైతే వారి అప్పులు పూర్తిగా రద్దు పరచాలని కూడా ఈ సంఘం వారు అభిప్రాయ పడ్డారు.

తరవాత వడ్డీ వ్యాపార చేసే వారు సక్రమంగా వ్యాపారం చేసేటట్లు చూడవలసిన ఆవశ్యకత ఉన్నదని కూడా, వీరు సూచించారు.

ఆ తరువాత ధాన్యం సకరానుగురించి వ్రాస్తూ సహకార సంఘాలద్వారా ధాన్యం అమ్మకం జరగాలనీ ధాన్యం కొట్లు నిర్మించాలని ప్రధానంగా సూచించారు.

ఆ పిమ్మట వ్యవసాయకూలీల పరిస్థితులను గురించి వ్రాస్తూ ఈ సంఘంవారు వెట్టిచాకిరీ మొదలయిన పద్ధతులు మద్రాసు సంస్థానం ప్రాంతాలలో ఉన్నాయనీ, ఇవి వెంటనే రద్దు చెయ్యాలనీ అభిప్రాయ పడ్డారు.

వ్యవసాయదారులకు ధాన్యానికి సరియైన ధరలు ఉండేటట్లు చూడాలనీ, ఇన్సూరెన్సుద్వారా వారికి సరియైన ప్రతిఫలం ముట్టేటట్లు చూడాలనీ, వ్యవసాయానికి సంబంధించిన లెక్కలు జాగ్రత్తగా వ్రాయించడం చాలా అవసరమనీ, దీనివల్ల గాని వ్యవసాయ పరిస్థితులు తెలుసుకోవడం కష్టమనీ, ఈ సంఘం వారు సిఫారసులుచేశారు.

## గుల్బర్గలో ఇద్దరు అధికార్ల సస్పెన్షను

సికిందరాబాదు, నవంబర్ 2: గుల్బర్గలోని డిప్యూటీ కస్టమ్సు కమీషనర్ కుతుబుద్దీన్ ఖాన్, మరొక అధికారి అబ్దుల్ వహీన్‌లను మిలిటరీ ప్రభుత్వాజ్ఞల ప్రకారం సస్పెండు చేశారని తెలుస్తున్నది.

# పశ్చిమ గోదావరి జిల్లాలో పంటలుపూర్తిగా పోయినవి

## తుపాన్ నష్టం గురించి తొలివార్త

### 9 రోజులు ఇతర ప్రపంచంతో సంబంధం లేకుండా పోయింది

చెన్నపట్నం, నవంబరు 3: 'ఆంధ్రపత్రిక' ఏలూరు విలేఖరి, ఈ ప్రాంతాల తుఫాను బీభత్సం గురించి 1-వ తేదీన ఇచ్చిన టెలిగ్రాం ఈ మధ్యాహ్నం మూడు గంటలకు అందింది. దీనిబట్టి టెలిగ్రాఫ్ లైను సరిఅయినట్లు స్పష్టము.

అక్టోబరు 27-వ తేదీరాత్రి ఈ ప్రాంతాలను వీచిన పెనుతుపానువల్ల కనివిని ఎరుగని నష్టము వాటిల్లినది. ఆరోజు సాయంత్రంనుంచీ ఆకాశం మేఘావృతమై వర్షం పడుతూ తెరలుతెరలుగా మధ్యగాలి అర్ధరాత్రి సమయానికి తుపాను ఉధృతమై తెల్లవారగట్ల 5 గం. వరకూ ఆమోతాదులోనే వీచింది. ఉధృత స్థితిలో గాలి గంటకు 80 మైళ్ళ వడితోకూడా వీచినట్లు చెపుతున్నారు. ఏలూరు తాలూకా అంతటా పాకలు, గుడిసెలు పడిపోయినవి. ఒంటుకూడా మిగిలినట్లులేదు.

మిల్లులుమొదలైన వాటిమీద కప్పులుగావున్న జింకురేకులు కొట్టుకుపోయాయి పెంకుటిండ్లపై పెంకులు ఎగిరిపోయాయి. 80% చెట్లు కూకటివేళ్ళతో పెల్లగిలి పడిపోయాయి. లేదా కొమ్మలువిరిగి పోయాయి. మిగతాచెట్లు ఆకులు రాలిపోయి కొమ్మలువిరిగి మొండిరూపు తాల్చినవి.

ఏలూరులో వాన కుండలతో పోసినట్లు కురిసింది. మురుగుకాల్వలలో చుక్క దూగరంపడి అవరోధం కలగడంవల్ల నీరు రోడ్లపైకి పాకి కొన్ని అడుగుల ఎత్తున నిలిచింది. గాలికి నిలవలేక ఎలెక్ట్రిక్ స్తంభాలు చాలాభాగం మన్మథ మడిచినట్లు క్రిందికి ఒరగడంవల్ల, తీగలు తెగడంవల్లా ఎలెక్ట్రిసిటీ సప్లయి ఆగిపోయింది. టెలిగ్రాఫ్, టెలిఫోనుతీగలుకూడా ఇట్లే తెగిపోయినవి. ఆ రాత్రినుంచీ ఈ తెలగమిచ్చే సమయంవరకూ ఈ పూరిక బయట ప్రపంచంతో సంబంధం లేకుండానే పోయింది ఎలెక్ట్రిసిటీ సప్లయి లేనందువల్ల వాటర్ వర్క్సు పనిచేయలేదు. 29 సాయంకాలం ఆయిల్ ఇంజన్ పెట్టి పనిచేయించి, మంచినీరు సప్లయిచేశారు. ఆ మధ్యాహ్నం వరకూ పరిసర గ్రామాలకు కూడా, రోడ్లపై చెట్లు పడడంవల్ల, బస్సుల రాకపోకలు జరుగలేదు. సి. ఆర్. రెడ్డి కాలేజీ షెడ్డులు, రిజర్వు పోలీసు లైనులు కొట్టుకుపోయాయి. నిలవ నీడలేకుండా పోయిన ప్రజలు ప్రభుత్వ కచేరీలలోనూ, సత్రాలలోనూ, కొందరి ఇళ్ళలోనూ ఆశ్రయం కలిగించారు.

అప్పుడు పనిపాటుల వాళ్ళంతా తమ ఇళ్ళను బాగుచేసుకోవడంలోనే నిమగ్నమయినందువల్ల కూలివాళ్ళెవరూ దొరకడంలేదు ఒకళ్లు, ఇద్దరూ వున్నారోజుకు రూ. 4/-లు అడుగుతున్నారు.

పైర్లకు విపరీతనష్టం వాటిల్లింది. ఈ సంవత్సరం పంట చాలా బాగా ఉన్నదనుకొంటూండగా ఈ నష్టం సంభవించడం రైతుకు చెప్పరానంతచింత కలిగిస్తున్నది.

ఈ సంవత్సరం పంట బాగావస్తుందని ప్రజలంతా ఆశించారు. కోతకు సిద్ధంగా వున్న బసంగిపైర్లు తుఫాను దెబ్బకి పూర్తిగా ధ్వంసమైపోయినవి. ఇతర రకాల వరిపైర్లుకూడ చాలవరకు నష్టమైపోయినవి. అనుకున్న దానిలో 5% కూడ రాదేమోనని ప్రజలు ఆందోళనపడుతున్నారు. బాగా సర్కారు జిల్లాల్లోకెల్లా మిగులు ప్రాంతమైన పశ్చిమ గోదావరిజిల్లా యీ తుఫాను తాకిడికి కొరతజిల్లాకాకతప్పదని కూడ ప్రజలు భయపడుతున్నారు. లోగడ అనేక తుఫానులకు తట్టుకొన్న స్థానిక జనపబారమిల్లు యీ తుఫానుకు పడిపోయింది. 27 వ తేదీ రాత్రి ప్రారంభింపబడవలసియున్న ఒక సినిమాహాలు గాలికి పూర్తిగా కూలిపోయింది. ఉండులూరు ఫిర్కా ప్రత్యేకాభివృద్ధి కేంద్రం ఉన్న గోపన్నపాలెంలోని ప్రాథమిక విద్యాశిక్షణాలయము ఉన్న షెడ్డు కూలిపోయింది. దానిలో ఉంటున్న విద్యార్థులు, ఎలాగో తప్పించుకొని ప్రాణాలతో బయటపడ్డారు. తప్పించుకో లేకపోయిన ముగ్గురు విద్యార్థులు తీవ్రంగా గాయపడ్డారు. బుడమేరు వరదలవల్ల రైలుమార్గం పూర్తిగా కొట్టుకుపోయిందని తెలుస్తున్నది. ఇదేకారణంవల్ల గుడివాడ, విజయవాడలతో గల రహదారి సౌకర్యాలన్నీ బంద్‌ఐపోయినవి. 29 వ తేదీ ఉదయంనుండి కొవ్వూరు, నూజివీడుల మధ్య రైళ్లునడుస్తున్నవి. మునిసిపల్ చైర్మన్ శీర్ల బ్రహ్మయ్య, ఉపాధ్యక్షుడు డి. రాజశేఖరరావుగార్లు సహాయ ఏర్పాట్లు చేస్తున్నారు. పట్టణంలో 4 చోట్ల. నిలువనీడ లేకుండా పోయినబాధితులకు ఉచితభోజన సౌకర్యాలు ఏర్పాటుచేశారు. జననష్టాన్నిగురించిన వార్తలేమీ యింతవరకు రాలేదు. కాని చుట్టుపట్లగ్రామాల్లో చాల పశువులు, పాకలుకూలి మీదపడటంవల్ల మరణించినవని తెలియవచ్చింది. వేలకొద్ది పక్షులు నశించిపోయినవి. సుందుగోలను వద్ద ఏలూరు కాలవలో రెండు సరుకుపడవలు తల్లకిందులై మునిగిపోయినవి.

(స్వ. వి.)

## ట్రామ్ డ్రైవర్ల కండక్టర్ల సమ్మె

మదరాసు, నవంబరు 3: నేడు మధ్యాహ్నం 1 గంటనుండి, ట్రాము డ్రైవరులు కండక్టరులు సమ్మెచేసినందున ట్రాములు రోడ్లమీద నిలచిపోయినవి. 1 గం. మధ్యాహ్నంషిఫ్టు పనిచేయవలసిన పనివారు పనులకురాలేదు. సుబ్రహ్మణ్యం అను కండక్టరుని సస్పెండు చేసినందున, వానిని తిరిగి పనిలో చేర్పించుకోవలెనని పనివారంతా పట్టుపట్టిరి. లేబరు కమిషనరు, ట్రాం కంపెని యజమానులువచ్చి రాయబారాలు నడుపుచున్నారు. సమ్మె సాయంకాలం లోగా ముగియగలదని ఎంచబడుచున్నది.

## స్థానికసంస్థల నౌకర్లకు ఖద్దరు దుస్తులు

### మద్రాసు ప్రభుత్వ ఉత్తర్వు

స్థానిక సంస్థలన్నియూ తమ సిబ్బందికి పొంగలు పండుగకు యిచ్చే వస్త్రములు ఖద్దరుదుస్తు లివ్వాలనియూ, అవి ఎన్ని కావాలో డిసెంబరు 1 వ తేదీలోగా ఖద్దరుశాఖ అధికారులకు తెలుపాలనియూ మదరాసు ప్రభుత్వం వారు స్థానిక సంస్థ కార్యనిర్వాహకులకు సూచించిరి.

# ఆంధ్ర రాజధాని

(2-వ పేజీ తరువాయి)

ఉపకారకం - అవశ్యకం.

ఇంతేగాక మద్రాసులో ఆంధ్రులెన్నో సంస్థలు స్థాపించినారు. వాటిగతి? కొంటూలసుబ్బారావు, మైలాపూరులో ఆ నాటివారు చాలామంది వకీళ్లు, నాగేశ్వరరావు, రామేశం, సర్ రాధాకృష్ణయ్య, రాజమన్నారు, ముత్తా సుబ్బారావు, చెంచయ్య, వావిళ్లవారు, మొదలగువారు ఉద్యోగిప్రముఖులు వర్తకప్రముఖులు, జమీందార్లు మదరాసులో దివ్యభవనాలు నిర్మించుకొన్నారే వాటిగతి?

మదరాసును అరవలకు విడిచి వెళ్లవలసినదనీ, తర్వాత అరవలు ఆంధ్రులను అధిక గౌరవంతో ఆదరిస్తారనీ, కొందరు అరవలు, అరవలతో జీర్ణించిన ఆంధ్రులూ అనడం వింటున్నాము. ఇది ఎట్లా ఉందంటే, కేపు, నీకు ఆకలిగాని పొమ్మన మిస్తాను. నేడు నాకు మీ యింట్లో వండిన వంటంతా పెట్టి పొమ్మన్నాడట ఒక బుద్ధిశాలి. అట్లు ఆంధ్రులమీద రేపు చూపబోయే ఆదరం నేడే యేల చూపరాదు? అసలు ఈ యిద్దరు కక్షిదార్లయినపుడు ఒకరిచ్చేవారూ ఇంకొకరు పుచ్చుకొనేవారూ అనడమేమిటి? ఇద్దరూ పంచుకొనైనా పంచుకోవలెను. లేదా, కామన్ ప్రాపర్టీగా ఇద్దరూ, సెంట్రల్ గవర్నమెంటు వారి ద్వారా అనుభవించనైనా అనుభవించవలెను.

సెంట్రలు గవర్నమెంటువారి కివ్వడం ఉభయుల గౌరవం, సౌహార్దం రక్షించుకోవడం అవుతుంది. తెలుసువారూ అరవవారూ పడుచుపెకలుగా కలయిక కలిగి ఉండడం మంచిదికాదా?

ఆంధ్రులకు ద్రవిడులకు సౌహార్దసంధిస్థానంగా మదరాసు సెంట్రల్ గవర్నమెంటువారి వశంలోనే ఉండవలెను. ఈ నిర్ణయం విషయంలో ఆంధ్రులంతా ఒక త్రాటిమీదనే నడువవలెను.

రంగాగారు, తిరుపతి ఆంధ్రప్రధాన నగరం కావలెనన్నారంటే ఆ అనడం అనాలోచితంగా క్షణికోద్రేకంతో అనడం అయినా కావలెను. వారనకపోయినా ఎవరయినా ఆ మాటను కల్పించి పత్రికలకు వ్రాయుడమయినా కావలెను.

ఈ విషయంలో విజయవాడలో శ్రీ వెంకటశాస్త్రిగారి సన్మాన సభలో శ్రీ ప్రకాశం, కుమారస్వామిరాజా ప్రభృతుల యెదుట స్పష్టంగా పైవిధంగానే మాట్లాడిన దానిని ఒక ఆంధ్రపత్రిక మాత్రం కొంత సరిగానే ప్రకటించింది. గాని తక్కిన పత్రికలు తార్మారు చేసినవి.

కాంగ్రెసు మీటింగు అయ్యేదాకా ఎవరూ ఏమీ మాట్లాడవద్దన్న రంగాగారి ఆదేశం పాటించి నేనీ విషయంలో ఇంతదాకా ఊరకుంటిని. రంగాగారి ఉపన్యాసము చదివి ఇక ఆగలేక యిది వ్రాసినాను. రాష్ట్రప్రధాన నగర విషయం ఆంధ్రుల తుతికోత విషయం.

1. మదరాసు సెంట్రల్ గవర్నమెంటు వారిదే కావలెను. ఇంకా బొంబై, కలకత్తా, హైద్రాబాదు నగరాలుకూడా సెంట్రల్ గవర్నమెంటువారివి కావడం మంచిది.

2. అరవలది తిరుచో, మధురో వారి యిష్టం (నేననుకొనేది తిరుచి అనే) ప్రధాన నగరం కావలెను.

3. ఆంధ్రుల ప్రధాన నగరం విజయవాడ కావలెను.

ఈ రాష్ట్ర విభాగ ప్రధాన ప్రయోజనం రాష్ట్రభాషామూలక పరిపాలనము. రాష్ట్ర విభాగముతోపాటు అదీ జరిగి తీరవలెను.

గాంధీగారి సమరస హృదయం ఆంధ్రులలో - ద్రవిడులలో, కాంగ్రెసునాయకులలో, గవర్నమెంటులో తొణికిసలాడవలెను. ఆంధ్రకాంగ్రెసు ఈ నిర్ణయమునే చేయగల్గుగాక!

"రఘుపతిరాఘవ సీతారాం సీతారాం జయ సీతారాం, జయసీతారాం.

'జయసీతారామ్' అర్థం గాంధీగారు చెప్పేదే కాగల్గుగాక.

పరా: ఇది వ్రాసిన తర్వాత రంగాగారు తిరుపతి విషయం పత్రికలలో వచ్చినట్లు తాను మాట్లాడలేదని ప్రకటించినట్లు విన్నాను సంతోషము.

# నాగాయపల్లె హరిజనుల భూమి

## జిల్లా కలెక్టరు ఉత్తరువు

ప్రొద్దుటూరు, నవంబరు 1: ఈతాలూకా నాగాయపల్లెలో హరిజనులు సాగు చేసుకొంటున్న భూమిలో 5 ఎకరములు, ఒక రాజకీయ బాధితునికి ఈజూను మాసమందు ఇవ్వడమైనది. దానిని పూర్వము హరిజనులు పురులకు భూమి తమ స్వాధీనంలో వున్నదని, తాము సాగుచేసుకుంటున్నారనీ తెలియపరచుకొన్న మీదట, కడపజిల్లా కలెక్టరుగారు రాజకీయ బాధితునికి ఆ భూమిని దాఖలు చేయుటను తాత్కాలికంగా ఆపవలసిందిగా ఉత్తరువులు జారీచేసినట్లు తెలిసినది.

ఈప్రాంత వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటరుగారు 300 టన్నుల ఫాస్ఫేటులు, 20 టన్నుల పసేటు ఈ తాలూకా రైతులకు పంపకం చేసిరి.

నిన్న సాయంకాలం 6 గంటలకు 7 ఏండ్ల బాలిక నూతిలోపడగా ఆమెను బయటకు తీసిరి కాని కొంతసేపటికి చచ్చిపోయింది.

# నగరి ఫిర్కా అభివృద్ధి సంఘ సమావేశం

## గత మాస కృషి సమీక్ష

నగరి, నవంబరు 1: ఈ ఫిర్కా అభివృద్ధి సంఘ సమావేశము నిన్న జిల్లా అధికారి ఎస్. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగెను. సమావేశానికి క్రొత్తగా ఎన్నికైన జిల్లా బోర్డు అధ్యక్షులు ఎస్. పి. చెంగల్రాయ నాయుడు గారు కూడ హాజరైరి. జిల్లా పశువైద్య శాఖాధికారి మాట్లాడుతూ జరిగిన మాసాంతంలో యీ ఫిర్కాలో 70 పశువులకు చికిత్స చేయించామని, 12 మంచి రకం జాతి కోళ్ళు పంచి పెట్ట బడినవని, 700 కోళ్లకు అంటు వ్యాధి నివారణకు యింజక్షనులు వేయించామని నుడివిరి. జిల్లా ఆరోగ్యశాఖాధికారి మాట్లాడుతూ, మాధవరంలో కలరా వ్యాధి వ్యాపించగా తక్షణం ఆ గ్రామానికి ఆరోగ్యశాఖవారు వెళ్లి వ్యాధి ఉధృతం కానివ్వకుండా నిరోధించారనీ 381 మందికి యింజక్షనులు వేశారని తెలిపిరి.

సహకార సంఘాల అధికారి మాట్లాడుతూ, మోరుకొండ క్రిందకంద్రిగ అను నగరి పేటలో ఒక సహకార సంఘాన్ని ఏర్పాటు చేశామనీ, వ్యవసాయానికి వుపయోగపడు పనిముట్లను తెప్పించి సహకారసంఘాల ద్వారా రైతులకు యిప్పించామనీ, పన్నూరులోని సహకార చర్మ పరిశ్రమలో రూ. 350/- విలువగల చర్మం కొనటమయిందనీ, ప్రత్యేకంగా ఒక జూనియరు యిన్‌స్పెక్టరును, తర్ఫీదుపొందిన అనుభవజ్ఞుని ఒకరిని పంపవలెనని రిజిస్ట్రారువారిని కోరడమైనదనీ అన్నారు. నంద్ర సహకార తాటాకు చాపల పరిశ్రమలో 50 తాటాకు చాపలు తయారుకాబడినవని, యీ పరిశ్రమలో 16 మంది పనిచేయుచున్నారనీ, ఎలకాట్టూరు హరిజనవాడ సహకార గృహనిర్మాణసంఘానికి యిండ్లస్థలములను కొనుటకుగాను నగంసబ్సిడీ ప్రభుత్వాన్ని యిప్పించవలసిందని కోరడమైనదనీ, ముడిపల్లి గ్రామంచుట్టువున్న గ్రామాల గొడ్లకు జీవనోపాధి కల్పించుటకు తాటిబెల్లం ఉత్పత్తిచేయు సహకారసంఘాన్ని ఒకటి ముడిపల్లిలో స్థాపించి నవంబరు నెలలో పని ప్రారంభించుటకు తగుఏర్పాట్లు చేయబడుచున్నవనీ అన్నారు.

వ్యవసాయశాఖవారు యీ ఫిర్కాలో చేసినకృషిని వివరించారు.

కొందరు రైతులు వ్యవసాయానికి ఆయిలు యింజనులు యిప్పించవలసిందని కోరిరి. జిల్లావ్యవసాయఅధికారి సమాధానమిస్తూ యీ జిల్లా మొత్తానికి రెండే ఆయిలు ఇంజనులు వున్నాయనీ, అవికూడ రైతులకే యిచ్చివున్నామని ప్రస్తుతం తమవద్ద పెట్రోలుఇంజనులు వున్నాయని అవి కావలయున్న ఒసగెదమనినుడివిరి.

ఫిర్కాలోని చెఱువులు కసంకాలువలు మరామత్తులులేక పాడుపడియున్నవనీ, వాటి మరామత్తులకు తగుశ్రద్ధ పుచ్చుకోవలసిందని రైతులు అధ్యక్షులకు తెలియజేయగా, అధ్యక్షులు శీఘ్రంలో వాటిపని ప్రారంభింపబడునని, యిప్పటికే కొన్ని చెఱువులు, మరామత్తులు జరుగుచున్నవనీ, యీ ఫిర్కాకు ప్రత్యేకంగా యిద్దరు సూపర్వైజర్లను నియమించియున్నామనీ అన్నారు.

నగరి పురవాసులు ప్రస్తుతం యిచ్చట రేషను దుకాణాలలో యిస్తున్న ఎఱ్ఱబియ్యం కొంత అధ్యక్షులకు చూపించి, యీ బియ్యం తినలేక చాలా అవస్థలుపడుచున్నామనీ, వీటివల్ల ఆరోగ్యం చెడునని తెలియపరుస్తూ, మంచిరకం బియ్యం యిప్పించవలసిందనికోరిరి. (స్వ. వి.)

# చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్షునకు సన్మానం

నగరి, నవంబరు 1: చిత్తూరు జిల్లా బోర్డు అధ్యక్షులు ఎస్. పి. చెంగల్రాయ నాయుడు గారు నిన్న యిచ్చటికి వచ్చిరి. వారికి స్థానిక పంచాయతీ బోర్డు సభ్యులు, స్థానిక కాంగ్రెసు వారు స్వాగతము యిచ్చిరి.

బోర్డుఅధ్యక్షుని రాకను పురస్కరించుకొని పాఠశాల ఆవరణలో ఎ. మురుగేశ మొదలి గారి అధ్యక్షతను పౌరసభ జరిగెను. జిల్లా బోర్డు అధ్యక్షులకు పౌరుల తరఫున సన్మానపత్రం సమర్పించబడెను. సభకు పుర ప్రముఖు లనేకులు విచ్చేసిరి. స్థానిక జిల్లాబోర్డు సభ్యులు కె. ఆర్. కుమారస్వామి శెట్టిగారు మాట్లాడుతూ బోర్డు అధ్యక్షుని సేవా త్యాగములను ప్రశంసించారు:

జిల్లా బోర్డు అధ్యక్షులు ఎస్. పి. చెంగల్రాయ నాయుడు గారు ప్రసంగిస్తూ తన కొసంగబడిన సన్మానానికి కృతజ్ఞత తెలియజేసిరి. (స్వ. వి.)

# రాష్ట్ర వార్తలు

## మాధవరం

కడపజిల్లా, సిద్ధవటం తాలూకా మాధవరంగ్రామం శ్రీ భావనారుషి దేవాలయముముందు నిర్మించిన పెద్దపందిరిలో జిల్లాకలెక్టరు మాధవరావుగారి అధ్యక్షతన అక్టోబరు25న గొప్ప బహిరంగసభ జరుపబడెను.

దీనికి మద్యనిషేధోద్యోగులు తహసిల్దార్లు అభివృద్ధిశాఖోద్యోగులు హాజరైరి. మద్యనిషేధమును గురించి అధికార్లు విపులముగా ప్రజలకు బోధచేసిరి.

## రేపల్లె

ఈతాలూకా వరదబాధితుల సహాయార్థము స్థానిక తహసీల్దారు సబుమేజిస్ట్రేటు పస్లయి ఆఫీసరుగార్లు "ఖిల్జిరాజ్యపతనము" అను నాటకమును నిన్న ప్రదర్శించిరి. సుమారు పాతిక, ముప్పది వేలరూపాయలు వరకు వసూలు కానట్లు తెలియుచున్నది. నాటకమునకు గుంటూరు జిల్లాకలెక్టరు, జిల్లా పోలీసు సూపరింటెండెంటుగార్లు తదితర ఉన్నతోద్యోగులు వచ్చిరి.

## బనగానిపల్లె

స్థానిక కోఆపరేటివ్ బాంకు లిమిటెడ్ భాగస్వాములు నిన్న తహసీల్దారుగారి అధ్యక్షతన సమావేశమై యీ క్రింది వారిని డైరెక్టర్లుగా ఎన్నుకొనిరి. పి. నాగయ్య, గాధంశెట్టి సుబ్బరాయుడు గుప్త, జె. సత్యనారాయణ, టి. వి. కృష్ణన్, డాక్టర్ జైనులాబ్దీన్, నూకల కొండయ్యశెట్టి, నిచ్చెనమెట్ల బాలసుబ్బయ్య, వల్లిగట్ల వేంకటసుబ్బారెడ్డి కానాల లక్ష్మిరెడ్డిగార్లు.

# పరమహంస చిత్రపటా విష్కరణ

హిందూపురం, అక్టోబర్ 30: మొన్న సాయంకాలం స్థానికఉన్నతపాఠశాల 5 వ ఫారము ని సెక్షనులో శ్రీరామకృష్ణ పరమహంస చిత్రపటమును విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారు ఆవిష్కరించిరి.

ఆసందర్భమున, జిల్లావిద్యా శాఖాధికారిగారు కూడ హాజరైయుండిరి. (స్వ. వి.)

# శ్రీరామచంద్రేంద్ర సరస్వతీ స్వామివారి నిర్యాణము

గుంటూరు, నవంబరు 1: బాపట్ల తాలూకా మర్రిపూడిగ్రామము శివాలయమునకు ప్రక్కన శంకరమఠములో శ్రీ రామచంద్రేంద్రసరస్వతీ స్వామివారు గత సోమవారం పరమపదముపొందిరి. వీరిని అప్పయ్యస్వాములవారు అని ఎక్కువగా పిలుచుచుండెడివారు. వయస్సు 86 సంవత్సరములు. వీరి గురువులు పరశివేంద్రసరస్వతీస్వాములవారు. వీరి స్వగ్రామము పురాతన ప్రసిద్ధమైన అమరావతీపట్టణము. పిసుపాటి వంశీయులు. పూర్వాశ్రమమున వీరిపేరు అప్పావధానులు. అధ్యయనపరులు. వీరు ముగ్గురు అన్నదమ్ములు. వీరికి ఒక్క కుమారుడును ఒక్క కుమార్తెయు యున్నారు. వీరి కుమారులు లక్ష్మావధానులుగారు సుప్రసిద్ధ విద్వాంసులు. వీరు 'తత్వరహస్యము' తత్వసార సంగ్రహము' అను గ్రంథములను రచించిరి. వేద అధ్యయనక్రమమును, వేదపరీక్షా పద్ధతియు గ్రంథరూపమున ముద్రణము చేసియుండిరి.

మర్రిపూడి గ్రామమున నాగులచవితి రోజున బ్రహ్మోత్సవము జరిపి, శివాలయమున సమాధియందుంచి ఆసమాధియందు శివలింగ ప్రతిష్ఠయు జరుగుచున్నది.

శ్రీవారు సిద్ధిపొందు సమయమున పురజనులెల్లరు సర్వవిధ శుశ్రూషలు చేసిరి. ఆ సమయమున పూర్వాశ్రమమున వీరి కుమారులును వీరి ప్రథమశిష్యులును అగు లక్ష్మావధానులుగారును వారి భార్యయు, శ్రీవారి శిష్యులును, స్మార్తాధ్యాపక పరీక్షా సభ కార్యనిర్వాహకులును, వేదవిద్వత్పరీక్షా సభ నిర్వాహకులున్నూ రుద్ర పారాయణసంఘ కార్యనిర్వాహకులును తదితర పురప్రముఖులును ప్రక్కనుండిరి.

వీరు 43వ ఏటనే క్రమసన్యాస స్వీకారముచేసి విధితవేద ప్రమాణాను సారముగా దినచర్య గడపుచు అనేకమందికి ఆదిశ్రప్రాయులుగా నుండిరి. వేదమున జీర్ణోద్ధారణచేసి వేదవిద్వత్పరీక్షా సభను స్మార్తాధ్యాపకపరీక్షా సభయును స్థాపించి యీ జిల్లాలో 92 మంది సాంగ క్రమాధ్యయనము చేసిన వేదాభ్యాసపరుల తయారు చేసిరి యాత్రలలో ఉత్తమమును కృష్ణానదీ ప్రదక్షిణయాత్ర శ్రీవారి వేదమార్గ ప్రవృత్తిని చాటుచున్నది. సిరి జన్మస్థానము అమరావతిలో కోటిబిల్వార్చనయు అభిషేకపురస్సరముగా చేయించిరి. వేదప్రవర్తక సభవిద్యార్థుల తయారుచేయుటలోను, స్మార్తాధ్యాపక సభ అధ్యయనము చేసిన వారిని గ్రంథము ఉపయోగములో నుంచుకొను రీతిగను, గురుపారాయణ సంఘము పర్వులు ఈశ్వరపూజచేసి లింగించుమార్గము ప్రవర్తించుచున్నవి. (స్వ. వి.)

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 5 శనివారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 పి. ఎస్. కోకిలం పాట. 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 ఉదయ సంగీతం రికార్డులు. 8-30 మద్రాసు (బి) వలె. మ. 1-0 మద్రాసు (బి) వలె. 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమా సంగీతం రికార్డులు 4 పిల్లల కార్యక్రమం ఆంగ్లమున 4-40 పాశ్చాత్య సంగీతం రికార్డులు సా. 5-30 ఎం. నగేశ్ పాట 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 మైథిలీ నాగేశ్వరన్ పాట 7-0 ఎన్. ఎం. లోకనాథన్ పి. ఎన్. కళ్యాణసుందరం 7-30 గీతమంజరి రికార్డులు. 7-45 ద్వారం వెంకటస్వామి నాయుడు వయొలిన్, టి. వి. ఎస్. నారాయణన్ మృదంగం టి. ఎస్. విల్వాద్రి అయ్యర్ ఘటం 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 మద్రాసురాష్ట్ర ఆర్థికస్థితి రాష్ట్ర ప్రభుత్వ ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారి ఆంగ్లప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె 10-0 పాశ్చాత్య సంగీతం రికార్డులు.

## మద్రాసు (బి)

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 తురయూర్ రాజగోపాలశర్మ రికార్డులు 7-45 మద్రాసు (ఎ) వలె 8-30 బాలానందం నిర్వహణ న్యాపతి కామేశ్వరి. మ. 1 మహిళామండలి రామరతన్ మీరాధజన్ లక్షణమైన కాపురం పరస్పర సంభాషణ ప్రసంగం. జి. వి. కమలామణి. సారంగి వాద్యం. మహిళాలోకం 1-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు 4 మద్రాసు (ఎ) వలె. సా 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం రికార్డులు 6-30 గ్రామస్థుల కార్యక్రమం. ఎన్నికలలో మంచిచెడ్డా వయోజనవోటు వినియోగము. సంభాషణ. జ్వాలా తోరణము 7 తెలుగున వార్తలు 7-15 ఫిల్ము సంగీతం రికార్డులు, 7-45 మద్రాసు (ఎ) వలె. 9-30 కలక్కాడ్ రామ నారాయణయ్యర్ రికార్డులు 9-45 పి. శాంతకుమారి ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రా సహా 10. శాస్త్రీయ సంగీతం. రికార్డులు.

## విజయవాడ

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 ఎం. రాజగోపాలశర్మ రికార్డులు. 7-30 జె. రాధాకృష్ణమూర్తి పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 శ్రోతలుకోరిన రికార్డులు 8-30 ఎం. చంద్రమతి పాట. మ 1 తోరాపథం రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 వాద్యసంగీత రికార్డులు. 1-50 తెలుగున వార్తలు. 4 బొమ్మరిల్లు పరుగునరారె బొమ్మతో భద్రాద్రికిఊహూ ఊహూ చలిచలి పాట. మనసేస్తాలు. ఆవు కథ తపాలసంచి చిలుకపలుకులు. సా 5-30 జె. రాధాకృష్ణమూర్తి పాట. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీత మంజరి. ఎం. ఎస్. సుబ్బలక్ష్మి రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మదరాసునుండి) 7 తెలుగున వార్తలు 7-30 ఉభయకుశలోపరి శ్రోతల ఉత్తరాలకి జవాబులు. 7-45 మద్రాస్‌వలె. 9 ఆంగ్లమున వార్తలు. 9-30 గానసుధ రికార్డులు. 9-45 మద్రాసు వలె.

## హైద్రాబాద్

ఉ. 7-30 వినాయక పట్వర్ధన్. ఖయాల్ గణగాలి. 8 ఆంగ్లమున వార్తలు. 8-20 రత్నమాచారి కర్నాటక సంగీతం. 8-50 తెలుగున వార్తలు. 9-15 సుశీలాబాయ్ దాద్రా. మ. 12-30 గీత్ మాలా రికార్డులు. 1 తారాపథం రికార్డులు, 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) సా. 5 గురునానక్ జయంతి. నానక్ గురించి ప్రసంగం. 5-15 వినాయక పట్వర్ధన్, ఖయాల్ ఫింప్లాస్. 5-30 ఆగాసర్వార్, ఘజల్ గీత్. 5-40 సుశీలాబాయ్ దాద్రా. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. శరీరారోగ్యం. (7) గాలి, దాని ప్రభావం. సంభాషణ, రచన, కె. శితారామయ్య, జానపదగేయాలు. కె. వెంకటేశ్వరరావు. ద్విపద కావ్యపఠనం. 7 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 7-15 పురాణం. 7-55 ఆగాసర్వార్ గీత్. 8-30 అంతర్జాతీయ సహకారుల దినోత్సవం. కె. ఐ. విద్యాసాగర్, ఆంగ్ల ప్రసంగం. 8-40 రత్నమాచారి కర్నాటక సంగీతం. 9 ఆంగ్లమున వార్తలు. (ఎ. ఐ. ఆర్. రిలే.) 9-30 సుశీలాబాయ్, సూరదాస్‌భజన్ 9-55 వినాయకరావు, పట్వర్ధన్, ఖయాల్ దర్బారీకన్నడా. 10-20 ఆగాసర్వార్ గీత్. 10-30 సుశీలాబాయ్ తుమ్రీ, ఘజల్. 10-45 వినాయకరావు, పట్వర్ధన్, ఖయాల్ మాల్‌కౌస్.

# అన్నామలై విశ్వవిద్యాలయ బి. ఇ. డిగ్రీ

మదరాసు, నవంబరు 1: అన్నామలై విశ్వవిద్యాలయమువారి బి. ఇ. డిగ్రీని మదరాసు విశ్వవిద్యాలయమువారి డిగ్రీతో సమానముగ ఎంచవలెనని ప్రభుత్వము వుత్తర్వు చేసెను.

# మద్రాసు వార్తలు

## మదరాసు శాసనసభా కాంగ్రెస్‌పార్టీ సమావేశం

చెన్నపట్నం. నవంబరు 2: మదరాసు శాసనసభా కాంగ్రెస్‌పార్టీ కార్యవర్గసభ నవంబరు 6 తే. 9 గం. మూంటుకోడు ప్రభుత్వ భవనముసందలి పార్టీ ఆఫీసులో జరుగును. పార్టీ సర్వసభ్య సమావేశం సా. 4 గంటలకు జరుగును అని శాసనసభ కాంగ్రెస్‌పార్టీ కార్యదర్శి వ్రాస్తున్నారు.

## 1949 ప్రజారక్షణ బిల్లు ప్రకటన

మదరాసు, నవంబరు 2: అసెంబ్లీలో ప్రవేశ పెట్టబడు నాలుగు బిల్లులు అక్టోబరు 31 తేదీ అసాధారణ గెజెటులో ప్రకటించిరి. అవి (మదరాసు) ప్రజారక్షణ బిల్లు 1949 (2) ప్రజావసర పదార్థముల కంట్రోలు అండ్ రిక్విజిషన్ (తాత్కాలిక అధికారముల) బిల్లు (3) మదరాసు భవనముల (అద్దె) కంట్రోలు బిల్లు 1949 (4) [illegible] (సవరణ) బిల్లులు.

## ఆహారవుత్తర్వుల ఉల్లంఘన నివేదిక

మదరాసు, నవంబరు 2: మదరాసు రాజధానిలో (కృష్ణా, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, సేలం, కడపజిల్లాలలో తప్ప) సెప్టెంబరు 30 తో అంతమైన పక్షములో 701 ఆహారకేసులు పరిష్కరించబడినవని ప్రభుత్వ నివేదికలో తెలుపబడెను. ఇందుమిందుమనకే. విశాఖపట్నంలో 2, నీలగిరి 3, బళ్ళారి 6, నెల్లూరు 7, ఉ॥ ఆర్కాటు 8, చిత్తూరు 12, చెంగల్పట్టు 12, ద॥ కనరా 21, మధుర 25, మలబారు 28, తిరునెల్వేలి 35, మదరాసు 36, ద॥ ఆర్కాటు 47, తంజావూరు 48, రామనాడ్ 66, తిరుచిరాపల్లి 78, కోయంబత్తూరు 124, గంటూరు 137, తక్కినజిల్లాలలో కేసులు ఏమీలేవు.

392 కేసులలో రు. 3/- ల మొదలు రు. 50 వరకు 44 కేసులలో రు. 51 నుండి రు. 100 వరకు 23 కేసులలో రు. 101 నుండి రు. 200 వరకు జుల్మానాలు విధించిరి.

నేరస్థులలో 39 నుండికి 1 నెలవరకు, 45 నుండికి నెలనుండి 3 నెలలవరకు శిక్షలు విధించిరి. 5 కేసులలో నేరస్థులకు 3 నెలలకుమించి విధించిరి. 175 కేసులలో విడుదలచేయుట జరిగినదని నివేదికలో తెలిసెను.

## సైనికోద్యోగాలు

మదరాసు, నవంబరు 2: భారతీయ సైనిక శాఖా విభాగములందు ఉద్యోగాలకై 1950 ఫిబ్రవరి మొదలు సర్వీసు కమిషను వారు 1950 సిబ్రవరి మాసమునందు మదరాసు, బొంబాయి, నాగపూరు, అలహాబాదు, కలకత్తా, ఢిల్లీలందు పరీక్షలు జరిపెదరు. పరీక్షిత కేసులు స్థలములు తరువాత ప్రకటించబడును. వివరాలకై మదరాసు, బెంగుళూరు లండన్, ఎయిరుఫోర్సు రిక్రూటింగు ఆఫీసరుకి వ్రాయవలెను.

## ఆసవాలు; అరిష్టాలు

మదరాసు, నవంబరు 1: (1) ఒకసారి 2 ఔన్సుల బ్రాందీ నిశ్చయంగాగాని, ఎందులోనైన కలిపిగాని, (2) అసవాలు, అరిష్టాలుగా చెప్పబడే నిషావస్తువులు చేరిన మందులు తప్పుడు (క్వార్టు) మించకుండా గాని, పైగా సీసాలు కొని పుచ్చుకుంటున్నవారిని, సంతలిసుకొని పోవుచున్న వారిని, మద్యనిషేధ చట్టంప్రకారం శిక్షింపనవసరంలేదని మదరాసు ప్రభుత్వం వారు ఉత్తరువు చేసిరి.

నిషావస్తువులు కొన్నవారు, ప్రొహిబిషను కమిషనరు ఈ విషయమై రాష్ట్రం జిల్లాలకు ఎగుమతి చేయవచ్చుని ప్రభుత్వంవారు ఉత్తరువుచేసిరి.

## హరిజనులకు సౌకర్యాలు

మదరాసు, నవంబరు 1: క్రైస్తవ మతములోనికి పోయిన హరిజనులకు ఏలు వంటి సౌకర్యములు లభించునని ప్రధానమంత్రి నెహ్రూగారు మదరాసు ప్రభుత్వాన్ని కోరగా, యిట్లు తెలియజేసిరని తెలియుచున్నది:- హరిజనులు క్రైస్తవమతములో చేరకముందు ఎటువంటి సౌకర్యాలు పొందుచున్నారో అవి యిప్పుడును పొందుచున్నారుగాని, తగ్గించలేదు. విద్యాసంస్థలలో అర్ధజీతం సౌకర్యం అందులో చేరినదే.

హిందూసంఘంలోనే యింకాయున్న హరిజనులకు. పూర్తి జీతం లేకుండా విద్యనేర్చుకొను సౌకర్యాలు అదనంగా ఇవ్వబడినవి. క్రిస్తాను మతంలోనికి పోయినవారు యీ సౌకర్యాలను పొందుటకు హరిజనులకు లేకుండా చేయుటకుగాను హిందూసంఘంలోనికి తిరిగి వచ్చినవారికి యీ సౌకర్యాలకు అర్హులు కారని నిర్ణయించబడెను.

## మెడికల్ కాలేజీలలో జీతం మినహాయింపు

మదరాసు, నవంబరు 1: మదరాసు రాష్ట్రములోని వైద్య కళాశాలలలో విద్యానియమములక్రింద అర్హతగలిగిన బీద విద్యార్థులకు పూర్తిజీతము, అర్ధజీతము మినహాయింపు ఇచ్చుటకు సంబంధించిన ప్రణాళికను ప్రభుత్వము మంజూరు చేసినది. ఈ మినహాయింపులమీద మెడికల్ కాలేజీ జీతములను పెంచుటవలన వచ్చు అదాయములో ఏ సంవత్సరమునకూ 20%కి మించకూడదని నిర్ణయించిరి.

రాష్ట్రములోని వైద్య కళాశాలలవారీ మినహాయింపుల సంఖ్యను ఈవిధముగా నిర్ణయించిరి:- మదరాసు మెడికల్ కాలేజీ పూర్తిజీతము మినహాయింపు 12, అర్ధజీతము 22 స్టాన్లీ మెడికల్ కాలేజీ, పూర్తిజీతం మినహాయింపు 6 అర్ధజీతం మినహాయింపు 13, ఆంధ్రా మెడికల్ కాలేజీ పూర్తిజీతం మినహాయింపు 4, అర్ధజీతము మినహాయింపు 10. గుంటూరు మెడికల్ కాలేజీకి 1 పూర్తిజీతం మినహాయింపు, 2 అర్ధజీతము మినహాయింపు. మధుర కాలేజీకి పూర్తి జీతము మినహాయింపు 1, అర్ధజీతముమినహాయింపు 2 నిర్ణయించిరి.

## రవాణాకంట్రోలు అర్డరు రద్దు

మదరాసు బియ్యం, గోధుమలు మినుములు, మిఠాయి రవాణాకంట్రోలు ఆర్డరు 1947 ని ప్రభుత్వంవారు రద్దుచేసిరి.

## కార్మికజీవిత వ్యయసూచన సంఖ్య

మదరాసు, నగరంలో కార్మిక జీవిత వ్యయసూచన సంఖ్య అక్టో. 15 వ తేదీతో అంతమయ్యే వారమునందు 323 గలదు. అదివరకున్న 2 ఎక్కువ, కాయగూరలు బెల్లం, పొగాకు ధరలు పెరిగినవి.

### కారులలో దొంగతనాలు

మదరాసులో మోటారుకారులు రోడ్డు పైనుంచి స్వంతవారు దుకాణాలలోకి హోటల్సులోకి పోయివచ్చేలోపున, కారులలోనున్న సామానులు కొందరు దొంగలించుచున్నారు, అట్టివారిని పోలీసులు నల్గురిని సోమవారంనాడు అరెస్టుచేసిరి. కారులలో సామానులు విడువరాదని హెచ్చరించిరి.

### స్మాలుకాజు కోర్టులు

ఈ దిగువ పట్నములందు తాత్కాలికంగా నియమింపబడిన స్మాలుకాజు కోర్టులు నవంబరు 4 వ తేదీనుండి యింకో ఏడాది వరకుండాలని ప్రభుత్వంవారు నిశ్చయించిరి: అనంతపూరు, బళ్లారి, కడప, ఏలూరు, గుంటూరు, మచిలీపట్నం కర్నూలు, నెల్లూరు, విశాఖపట్నం.

### గౌ॥ పరమేశ్వరనుగారు

హరిజనమంత్రి వి. పరమేశ్వరనుగారు 5 వ తేదీన బెజవాడకు పోయి తిరిగి 7 వ తేదీన మదరాసు వత్తురు.

### తంతి వార్తలు

పాకిస్తానుకి బర్మాకు రిప్లయి ప్రిపెయిడు టెలిగ్రాములు ఎం. ఎస్. ఎం. రైల్వే టెలిగ్రాఫ్ స్టేషనులలో పుచ్చుకోరని, ప్రకటించబడెను.

### ట్రాక్టర్లు

1949-50 సంII న 50 ట్రాక్టర్లు కొనుటకు మదరాసు ప్రభుత్వమువారు స్కీము అంగీకరించిరి.

### కో-ఆపరేటివ్ స్టోర్సులో దొంగతనం

చెంగల్పట్టుజిల్లా కోఆపరేటివు సొసైటీల స్టోరు గిడ్డంగినుండి 29, 31 తేదీలమధ్య 8 [illegible] మిల్లువస్త్రాలు రూ. 8000 విలువ గలవి దొంగిలించబడినవి. రాత్రి చూరుపై కన్నంపొడిచి యీ సరకు దొంగిలించబడినవి.

## లేపాక్షి దేవాలయ చిత్రకళా ప్రచురణసంఘ సమావేశం

హిందూపురం, అక్టోబరు 31: లేపాక్షి దేవాలయ చిత్రకళా ప్రచురణ సంఘ సమావేశం నిన్న యిచ్చట జరిగింది. సంఘం అధ్యక్షులు కల్లూరు సుబ్బారావుగారు, కార్యదర్శి లేపాక్షి వెంకటనారాయణగారు, యస్. ఆదినారాయణరావుగారు, మ్యూజియం డివిజనల్ ఇన్స్పెక్టరు వి. పద్మనాభరెడ్డి గారు హాజరయ్యారు.

లేపాక్షి చిత్రకళావైభవ్యమును ప్రజలకు పరిచయముచేయుటకై 12 నమూనా ఫోటోలుగల ఒక కేలండరును డిశంబరుమాసములో ప్రచురించుటకు నిశ్చయించారు. సంఘంవారు తమ కార్యక్రమమును కొనసాగించుటకు సహాయముగ ప్రభుత్వం మూడువేల రూపాయలు గ్రాంటును ముందుగా ఇవ్వవలెనని ఒకతీర్మానమును, ప్రచురణలవల్ల వచ్చే లాభాన్ని లెక్కకుతీసుకోకుండా, ఐదువేల రూపాయలు ఉచిత గ్రాంటు ఇవ్వవలెనని ప్రభుత్వాన్ని కోరుతూ మరొక తీర్మానమును చేశారు. చిత్రకళా ప్రచురణల సంపాదకత్వం వహించమని డాక్టరు సి. శ్రీ నారాయణాచారిగారిని కోరుటకు నిశ్చయించిరి.

అక్టోబరు 29 న వాక్స్టెన్లీలో పండిట్ నెహ్రూగారు నారిస్ డామునుదర్శించి టెనెస్సీ జనరల్ మేనేజర్ జార్జి గ్రాంటుతో సంభాషిస్తున్న దృశ్యం. —ఫోటో ఐ. ఎస్. పి.

కెనడాలోని భారత హైకమీషనర్ కృపలానీ, పండిట్ నెహ్రూ గౌరవార్థం చేసిన విందుకు హాజరైన శ్రీమతి విజయలక్ష్మి పండిట్, కెనడా ప్రధానమంత్రి మెకంజీ కింగ్, శ్రీమతి ఇందిరాగాంధి. —ఫోటో ఐ. యస్. పి.

ఎడమవైపు పై చిత్రం: భారత ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ నారిస్ డామును దర్శించినపుడు టెనెస్సీవాలీ ప్రధాన ఇంజనీరు సి. యి. బ్లీగారు టెనెస్సీ నదిపైగల 18 డాముల వివరములను మాపు సహాయంతో పండిట్ నెహ్రూకు వివరిస్తున్నారు. —ఫోటో ఐ. ఎస్. పి.

ఎడమవైపు రెండవ చిత్రం: కెనడాలోని రాక్లిఫ్ విమానాశ్రయంవద్ద కెనడా వైమానికదళంవారు చేసిన సైనిక గౌరవాభినందనాలు స్వీకరిస్తున్న పండిట్ నెహ్రూ. వారివెన్కగా వున్నవారు కెనడా రక్షణమంత్రి బ్రూక్ క్లాక్స్టన్. ఫోటో ఐ.ఎస్.పి.

సమితి అధ్యక్షుని కార్యాలయంలో పండిట్ నెహ్రూ: వరుసగా సర్ బి. యన్. రావు, గిరిజాశంకర్ బాజ్పాయ్, ఇందిరాగాంధి, పండిట్ నెహ్రూ, అధ్యక్షుడు జనరల్ రోమ్యులో శ్రీమతి విజయలక్ష్మి పండిట్ కార్యదర్శి ట్రిగ్వేలీ.

జిల్లా కళాశాలాధికారులు పండిట్ నెహ్రూను కళాశాల [illegible] భవనాలను చూపుతున్నారు. పండిట్ నెహ్రూ ఎడమవైపున ఉన్నవారు కళాశాలాధ్యక్షురాలు నార్గరెట్ క్లాప్.

## చైనా-వీట్నాం సరిహద్దులకు అదనపు ఫ్రెంచి బలాలు

## కమ్యూనిస్టులు సరిహద్దు దాటివస్తే భద్రతామండలికి ఫిర్యాదు

సైగాన్, నవంబర్ 2: చైనా-వీట్నాం సరిహద్దుల్లో వున్న మొంకే రేవులోనూ, ఆ చుట్టుపక్కలవున్న టోంకిన్ రాష్ట్రంలోనూ ఫ్రెంచి అధికారులు అదనపు బలాలను నిలుపుతున్నారు. మొంకేలో 50 మంది ఫ్రెంచి సైనికులు ఉన్నారనీ టోంకిన్‌లోకి ఇంకా సైన్యాలు, విమానాలు తరలించబడుతున్నవనీ ఉన్నత ఫ్రెంచి సైన్యాధికారవర్గాలు తెలియజేస్తున్నారు. శత్రువులను తరుముకుంటూ చైనా కమ్యూనిస్టుసేనలు ఈ వారంలోనే ఈ సరిహద్దును సమీపించగలరని భావించబడుతున్నది.

చైనీస్ సైన్యాలు సరిహద్దు నియమాలను పాటిస్తాయనే తాము నమ్ముతున్నట్లు ఫ్రెంచి అధికారులు చెప్పిడించారు. వీట్నాం గెరిల్లాలు సరిహద్దులు దాటి కొన్ని పట్టణాలను ఆక్రమించుకున్నట్టు కొమింటాంగ్ ప్రభుత్వం తమకేమీ తెలియజేయలేదని వాళ్లు అన్నారు.

చైనా కమ్యూనిస్టులు సరిహద్దులుదాటి వీట్నాంమీద దాడిచేస్తే ఫ్రాన్సు ఏంచేస్తుందని అడగ్గా అది ఒక అంతర్జాతీయ సమస్య అవుతుందని వాళ్లు జవాబిచ్చారు. దీనినిబట్టి చైనా కమ్యూనిస్టులు దాడి చేసినంతటనే భద్రతా మండలికి ఫిర్యాదు చేస్తుందని చెప్పవచ్చునని పరిశీలకులు అంటున్నారు.

## ఇండో చైనా సమస్య

### ఇండియా వివరాలు మాత్రమే పంపినదట

లండన్, నవంబర్ 2: ఇండో చైనా విషయమై భారత ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి ఏవిధమైన "నివేదిక"ను కానీ సూచనను కానీ చేయలేదని భారత రాయబారి కార్యాలయోద్యోగులు నేడు ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా విలేఖరికి తెలియజేశారు. బ్రిటన్, ఇండియాలు కామన్వెల్తు ఉపయోగించే [illegible] నాలు, వివరాలు తమకు తెలిసినప్పుడు వారికి తెలియజేసే రివాజు ఉన్నది. కనుక ఇండో చైనా విషయమై తమకు తెలిసిన వర్తమానాన్ని, ఇండియా బ్రిటనుకు తెలియజేసి ఉండవచ్చుననీ, దానిని, రహస్య నివేదికగా వర్ణించటం అక్రమమనీ వారు అన్నారు. అయితే చైనా వ్యవహారాలు తమకు తెలిసినంతవరకూ ఇండియా బ్రిటన్‌కు తెలియజేయటం కూడా జరగలేదని వారు అంటారు.

ఇండియా బ్రిటనుకు ఇండో చైనా వ్యవహారాలను తెలియజేసిన దన్న వార్త బ్రిటిష్, ఫ్రెంచి పత్రికలలో ప్రధాన స్థానం ఆక్రమించింది. "నెహ్రూ ఫ్రాన్సును నిందిస్తున్నాడు" అన్న శీర్షికతో మాంచెస్టర్ గార్డియన్ పత్రిక ఆవార్తను ప్రకటించింది.

ఫ్రెంచి పత్రికలుకొన్ని త్రోవాన్ని ప్రకటించినవి. "మలయాలో తిరుగుబాటును అణచటానికి బ్రిటిష్ సేనలు 18 నెలల నుంచి సతమతమవుతూవుండగా ఆ విషయమేమీ ఎత్తక, ఇండో చైనాలో ఫ్రెంచి చర్యల విషయమై ఇండియా బ్రిటనుకు చెప్పటం ఆశ్చర్యం కలిగిస్తున్నది." అని కన్సర్వేటివ్ పత్రిక ఓరోర్ వ్రాసింది.

## పట్టాభిగారికి కర్నూలు జిల్లాబోర్డుచే సన్మానపత్ర సమర్పణ

కర్నూలు, నవంబరు 2: రాష్ట్రపతి డా॥ పట్టాభిసీతారామయ్య పంతులుగారు కర్నూలుజిల్లా పర్యటన సందర్భంలో యిక్కడకు వచ్చినప్పుడు నవంబరు 5 వ తారీకు జిల్లాబోర్డు సన్మానపత్రము సమర్పించును.

## సవరణ

1949 అక్టోబరు 29 "ఆంధ్రపత్రిక" 7 వ పేజీలో పడిన "ఇండియన్ కాఫీ బోర్డు" ప్రకటనలో "1949 సంవత్సరము నవంబరు 17 వ తేదీ మంగళవారము" అని యున్నది. ఇప్పుడు "మంగళవారము" అని యున్నచోట "గురువారము" అని చదువుకొనవలెను.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty St., G. T. Madras.